శ్రీః

# బిల్వాష్టోత్తర శతనామస్తోత్రమ్

(శివోల్లాస వ్యాఖ్యానము - స్ఫూర్తిశ్రీ)



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

1

శ్రీః

# బిల్వాష్టోత్తర శతనామస్తోత్రమ్

(శివోల్లాస వ్యాఖ్యానమ్ - స్ఫూర్తిశ్రీ)



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

© R. MOHANA RAO, M.Sc.,
H.No.: 4-103, I.L.T.D. Colony (Extn.)
Kothapet, CHIRALA - 523 157
✆ : 08594 - 34054

First Edition : 25-8-98
Sri Vinayaka Chavithi

Price : Rs. 10/-



This book is published with the Financial Assistance of M. Venkata Ramana and R. Kalyani

బిల్వాష్టోత్తర శతనామ స్తోత్రమ్

శివోల్లాస వ్యాఖ్యానమ్ - స్ఫూర్తిశ్రీ

ప్రథమ ముద్రణ - శ్రీ వినాయక చవితి, 25-8-98

పేజీలు 80, ప్రతులు : 1000

ప్రతులకు : 1. శ్రీశైల దేవస్థానము, శ్రీశైలము - 518 101
2. సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201

D.T.P. by
VR LASER PRINTS
CHIRALA - 523 155
☎ : 08594-36074

PRINTED at

# శ్రీ పత్రము

మారేడు చెట్టుకు సంస్కృతమున బిల్వవృక్షమని. శ్రీవృక్షమని పేర్లు. బిల్వ పత్రములతో శివపూజ చేసిన సాధించరానిది లేదని ఈ స్తోత్రము చెప్పుచున్నది. శివుని కత్యంతప్రీతి ప్రదాయకమైనదీ పూజ. శివాలయములలో పర్వదినములందు బిల్వార్చనము శివమంత్రములతో చేసిన సర్వపాపహరమనియు, అఖండపుణ్యప్రదమనియు శైవ గ్రంథములు అభివర్ణించినవి. బిల్వము అమృతోద్భవము. మూడు దళములు గలది. అచ్ఛిద్రమైనవి, కోమలమైనవి పూజకు శ్రేష్ఠములు. ఇటువంటి విశేషములన్నియు ఈ స్తోత్రమున పలుకబడినవి.

తంత్రగ్రంథములలో శివునేకాక మరికొందరు దేవతలను కూడ ఈ పత్రములతో అర్చించు పద్ధతులు చెప్పబడినవి. లక్ష్మీపూజ, స్వప్నేశ్వరీ పూజ వీనితో చేయుట కలదు. బిల్వపత్రములతో హోమము చేసిన దేవతలు తొందరగా పలుకుదురని మంత్రసాధకుల విశ్వాసము. బిల్వపత్రములతో హోమము చేసిన సంపదలు వృద్ధి చెందునని మంత్ర మహోదధి చెప్పినది. బిల్వవృక్షము క్రింద కూర్చుండి జపించిన సిద్ధించు కొన్ని సాధనలను గూర్చి మేరు తంత్రము విశదీకరించినది. దేవతలు ఋషులు మహాదేవుని బిల్వదళముల తో పూజించి కామ్యసిద్ధి బడసిరని పురాణము లనేకవిధముల వర్ణించినవి. కవిసార్వ భౌముడైన శ్రీనాథుడు-వ్యాసుడు శివపూజను బిల్వదళములతో చేసినట్లు ఎంత అందముగా వర్ణించినాడో చూడుడు.

ఉ॥ వేదవిభాగముం బరిఢవించిన పుణ్యుడు వేడ్కబూన్చె బి
ల్వీదళ పూజనంబు గడులెస్సగ గూరిమి శిష్యపంక్తితో
నాదిమభిల్లు నిత్యకరుణామృత పూరము జల్లు పుండరీ
కోదరభల్లు గృత్త కరి యూధపు మల్లుని గొండయల్లునిన్ -॥-

ఈ బిల్వ అష్టోత్తరశతస్తోత్రము పురాతనమైనది. దీనికి అర్థతాత్పర్యములు లఘువ్యాఖ్య రచించినవారు సుప్రసిద్ధ విద్వత్కవులు శ్రీ స్ఫూర్తిశ్రీ భాస్కరరావు గారు. సముచితమైన అన్వయముచేసి వీనిని అర్థవంతముగా భక్త పాఠకుల కందించిన వీరి కృషి ప్రశంసాపాత్రము. ప్రాచీనస్తోత్రములకు చాలాచోట్ల అన్వయము కుదరదు. చిరకాల పఠన పాఠనములతో నుండుటచే అలవాటై వాని అర్థమును గురించి ఆలోచించుట ఉండదు. అటువంటి సందర్భములలోనే పండితుల పరిశీలన అవసరమగు చుండును. అనుశ్రుతము గా వచ్చుచున్న ప్రాచీన రచనలను-ముఖ్యముగా పెద్దలు వ్రాసిరని చెప్పబడుచున్న వానిని మార్చుచుపుచ్చలేము. ఎటులో సమన్వయము చేయవలసి ఉండును.

ఈశ్లోకములలో మరీ ఎక్కువ ఇబ్బంది లేదుగాని కొంత తప్పలేదు. అధ్యాహా రములు-పూరణములు చేయవలసి వచ్చినది. స్ఫూర్తిశ్రీగారు తమ చాతుర్యముతో సమంచిత మైన అన్వయ క్రమములు కూర్చినారు. ఈ గ్రంథము భక్తులకత్యంతము ఉపయోగపడగలదని విశ్వసించుచు వ్యాఖ్యాతను హృదయపూర్వకముగా అభినందించు చున్నాను.

- ప్రసాదరాయ కులపతి

# శ్రీఫలము

అధికపాఠములు, ఫలశ్రుతితో 121 శ్లోకములతో కూడి, 'ఏకబిల్వం శివార్పణమ్' అనే మకుటముతో విరాజిల్లే ఈ బిల్వాష్టోత్తర శతనామ స్తోత్రమునకు శివోల్లాసమనెడి పేర వ్యాఖ్యానము నందించిన మాననీయుడు స్ఫూర్తి శ్రీ.

ప్రథమ శ్లోకం

'త్రిదళం, త్రిగుణాకారం త్రినేత్రం చ త్ర్యాయుధం ।
త్రిజన్మపాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్॥'

బిల్వపత్రమునకు శివునకు భేదమే లేదని చెప్పు చున్నది .

చివరి శ్లోకము

'బిల్వాష్టోత్తర శతం స్తోత్రం యః పఠేత్ భక్తిమా న్నరః ।
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే ॥

ఈ స్తోత్రమును భక్తియుక్తుడై యే/మానవుడు పఠించునో, ఆ మానవుడు శివలోకమును పొంది శివునితో కూడి ఆనందించునని చెప్పుచున్నది.

మారేడు ఫలాన్ని ఒక వామహస్తమున ధరించిన పరశమ్భువును వర్ణించే ఈ శ్లోక విశిష్టతను చూడండి.

"కల్పాంతానంత సూర్యద్యుతి మతి వికటానేక దంష్ట్రం షడాస్యం
వహ్నీంద్వర్కాంబు కాష్ఠాదశయుత మభిత: ప్రజ్వంత మ్మయూఖైః॥
శూలాసీషూగ్ర శక్త్యంకుశ వరనృశిరః శ్రీఫలేష్వాసవారి
ప్రోతత్పాశాభయాంకై ర్నిజభుజ పరిఘై స్త్వాం గురుం శమ్భుమీడే॥

ఈ శ్లోకము 'దూర్వాసముని ప్రణీతంబైన, తాంత్రికాద్వైతశైవసిద్ధాంత ఛాయలున్న 'శ్రీ పరశమ్భుమహిమ్నః స్తోత్రమ్'లోనిది.

శివుడు పంచముఖుడనియే ప్రసిద్ధము, కాని మహాన్యాసమున 'పాతాళ షష్ఠ మ్ముఖమ్' అని ఆఱు ముఖములు చెప్పబడినవి. ఇచట శమ్భుడు షణ్ముఖుడని చెప్పుట, శమ్భువుయొక్క పావకత్వమును వ్యక్తీకరించుట జరిగినది. పంచముఖము లున్నప్పుడు పూర్వపశ్చిమదక్షిణోత్తరోర్ధ్వాభిముఖములైన ముఖములకు, అధోదిశాభిముఖమైన ముఖమును చేర్చినచో శివుని కాఱు ముఖములనుట సబబుగానే యుండును. పరశమ్భువునకు ఇచ్చట పన్నెండు చేతులు, పన్నెండు ఆయుధములు చెప్పబడినవి. శూలము, కత్తి, బాణము, ఉగ్రశక్తి, అంకుశము, వర చిహ్నము దక్షిణ భాగమున నున్న హస్తములందు -॥- పుఱ్ఱె, ధనువు, చక్రము, పాశము, మారేడు కాయ, అభయ చిహ్నము వామభాగమున నున్న హస్తములందున్నవి.

# శ్రీవృక్షము

బిల్వ వృక్షము శివ స్వరూపము. దీనికి మారేడు అని ప్రాంతీయనామము. రూటేసీ కుటుంబానికి చెందిన దీని శాస్త్రీయ నామము ఏగిల్ మర్మిలాస్ (లిన్నెయస్) కరియా. ఆరేడు మీటర్లు ఎత్తు పెరిగే ఈ వృక్షం కొమ్మలకు 2 నుండి 3 అంగుళాల దాకా పొడవుండే ముండ్లు ఉంటాయి. పత్రాలు త్రిదళ సంయుక్తము, పుష్పాలు లేత ఆకుపచ్చగా ఉంటాయి. ఫలాలు దీర్ఘగోళాభంగా గాని, గోళాభంగా గాని ఉండి పైన గట్టి పెంకు, లోపల జిగటగా ఉండే గుజ్జుతో కూడి విత్తనాలను కలిగియుంటాయి. ఇది ఆంధ్ర ప్రదేశ్ అరణ్యాలన్నింటిలోను పెరుగుతుంది. శివునకు అతి ప్రీతికరమైనది గావున శివాలయాలలో దీనిని పెంచుతారు. మారేడు ఫలాలు జనవరి ఏప్రిల్ నెలల్లో లభిస్తాయి. వైద్యరీత్యా ఇది దశ మూలాలకు చెందినది. వేళ్లు జీర్ణశక్తిని పెంచుతాయి. వాతాన్ని హరిస్తుంది. పండులోని గుజ్జు ఉదరశూలను పోగొడుతుంది. బిల్వ పత్రాలను నానవేసిన నీటిని రోజా తీసుకుంటే మధుమేహ వ్యాధి తగ్గుతుంది. ఆయుర్వేదము, సిద్ధ, యూనానీ వైద్యాలలో దీనిని వాడుతారు.

గృహముల ఆవరణలో పంచ బిల్వాలుగా పేరు పొందిన తులసి-బిల్వము, నిర్గుండీ (వావిలి)-జంబీరము- ఆమలకము మొక్కలు నాటండి, పెంచండి. ఈ వృక్షదళాలతో శివపూజ చేయండి. ఆరోగ్యాన్ని సౌభాగ్యాన్ని పొందండి. శివునితో కూడి ఆనందించండి.

బిల్వాష్టోత్తర శతనామస్తోత్రముతో బాటు శ్రీ శివపంచాక్షరీ మహా మంత్రమునకు జగద్గురు శ్రీ శంకరాచార్యుని శిష్యులైన శ్రీ పద్మపాదాచార్యులవారి వార్తికమును, పంచముఖ శివ ధ్యానశ్లోకాలు-మహామంత్రాలు, శ్రీ శివపంచాక్షరీ స్తోత్రము, పాణిమంత్రము, అర్ధనారీశ్వర స్తోత్రము ఇందు పొందుగబడినాయి.

బిల్వాష్టోత్తర శతనామ స్తోత్రమునకు - శివోల్లాస వ్యాఖ్యానమందిచిన స్ఫూర్తిశ్రీ గార్కి, వ్యాఖ్యానం వెలువడుటలో చేయూత నిచ్చి సహాయ సహకారాలందించిన 1.శ్రీనాథుని ప్రణీతంబైన శ్రీభీమేశ్వరపురాణమునకు దక్షిణకాశికా వ్యాఖ్యానమందించిన శ్రీ గుండవల్లి లక్ష్మీనారాయణగార్కి, 2. ఈ గ్రంథానికి "శ్రీపత్రము"నందించిన తాంత్రిక ప్రపంచమున వెలిగే పుష్పమైన డాక్టర్ ప్రసాదరాయకులపతి గార్కి నా నమస్సుమాంజలులు.

ఈ వ్యాఖ్యాన గ్రంథాన్ని - దేశములోని అన్ని శివాలయాలవారు యధేచ్ఛగా పునర్ముద్రించుకొనవచ్చును.

దీనిని సాధన గ్రంథమండలిన వెలువరించిన శ్రీ బులుసు సూర్య ప్రకాశ శాస్త్రి గారికి నమస్సులు.

- మోహన్‌రావు

ఓం నమశ్శివాయ

## అథ శ్రీమద్భగవత్పాద పద్మపాదాచార్య

విరచితమ్

# శ్రీ శివపంచాక్షరీభాష్యమ్

శ్రీగణేశాయనమః .

## ఓం నమశ్శివాయేతి మన్త్రః

తస్య ప్రథమం వ్యాఖ్యానమ్

త్యాగో హి నమసోవాచ్య ఆనన్దః ప్రకృతే స్తథా।
ఫలం ప్రత్యయవాచ్యం స్యాత్త్యాజ్యం పత్రఫలాదికమ్॥ 1
త్యజామీదమిదం సర్వం చతుర్ణామిహ సిద్ధయే।

ఓం నమశ్శివాయ

అథవా నమసో వాచ్యః ప్రణామోదైన్య లబ్ధయే॥ 2
దైన్యం సేవా తథా జ్ఞప్తిః సిద్ధి స్సర్వస్య వస్తునః।
నమామి దేవదేవేశం సకామో 2 కామ ఏవ వా॥ 3

ఓం నమశ్శివాయ

నజ్ఞా నిషిధ్యతే భావవికృతి ర్జగదాత్మనః।
మననం దేవదేవేశ నేహ నానాస్తి శబ్దతః॥ 4
అయేతి గమయేత్యర్థే తస్మాచ్ఛుద్ధో 2 స్మి నిత్యశః।
ప్రణామో దేహ గేహాదే రభిమానస్య నాశనమ్॥ 5

ఓం నమశ్శివాయ

శివో బ్రహ్మాది రూప స్స్యాచ్ఛక్తిభి స్తిసృభి స్సహ।
అథవా తుర్య మేవస్యా న్నిర్గుణం బ్రహ్మ తత్పరమ్॥ 6

నమసో నమనే శక్తి ర్నిమనం ధ్యానమేవ చ।
జే2న్తాత్తాదాత్మ్య సమ్బన్ధః కథ్యతే ప్రత్యగాత్మనోః॥ 7
అహం శివః శివో2 హఞ్చ మన్యే వేదాన్త నిష్ఠయా।
ఇత్యేవం నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః॥ 8
అథవా దాస ఏవాహమహం దాస ఇతీరణమ్।
ఇత్యేవ నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః॥ 9
అథవేదమిదం సర్వం త్యజామి పరమాప్తయే।
అర్థం ధర్మఞ్చ కామఞ్చ వాఞ్ఛంశ్చ జగదీశ్వరమ్॥ 10
ఏతన్మన్త్రార్థ తత్త్వజ్ఞై ర్వేదవేదాన్త తత్పరైః।
నిర్ణీతం తత్త్వగర్భం యద్విజ్ఞేయం ముక్తి లబ్ధయే॥ 11
అథవా ముక్తిలాభాయ ధ్యేయం తత్త్వం వివేకతః।
భిన్నం బుద్ధ్వా హృదా దేవం మన్త్రేణేశం జగద్గురుమ్॥ 12

ఓం నమశ్శివాయ

నమేరచి నమః ప్రోక్తో జన్తాస్యా జ్జగదీశ్వరే।
తస్మాద్దాసో2హమిత్యేవం మత్వా మాం ప్రాపయాత్మని॥ 13

ఓం నమశ్శివాయ

అస్మి ఛ్చేతే జగత్సర్వం తన్మయం శబ్దగామియత్।
తద్వానాచ్ఛివ ఇత్యుక్తం కారణం బ్రహ్మ తత్పరైః॥ 14
నమా యస్యాస్తి లక్ష్మీశ! సో 2 హం దేవో న సంశయః।
తస్మాన్మే ప్రాపయేహైవ లక్ష్మీం విద్యాం సనాతనీమ్॥ 15
యస్మాదానన్దస్వరూప స్త్వం దేవై ర్వేదై ర్నిగద్యసే।
తస్మాన్మే దేహి యోగీశ। భద్రం జ్ఞానం సుభావనమ్॥ 16

ఓం నమశ్శివాయ

యస్మాత్త్వం నేతినేతీతి నఞర్థం మా2 సి వేదజమ్।
తస్మాన్నమో2సి భద్రం మే యతో జాతో2 నమో నమః॥ 17

శివం శివమథా22 ప్రాప్తః శివాయేతి నిగద్యసే।
శివాయ మే తథా ప్రాప్త్యా శివాయం కురు సర్వదా॥ 18

ఓం నమశ్శివాయ

శివాం యాతో మహాభద్ర। నమో2 హం మాయయా ధ్రువమ్।
తతో నమాయ మహ్యాం మః శివాయం కురు సర్వథా॥ 19

ఓం నమశ్శివాయ

శివమేషి యతో జ్ఞప్త్యా శివాయ స్త్వం ప్రపశ్యసే।
న తే మాయా యతో జ్ఞప్త్యా నమోవేదైః ప్రపశ్యతే॥ 20

నమో2 హఞ్చ శివాయో2 హం నమో మహ్యాం నమోనమః।
నమో నమాయ శుద్ధాయ మఙ్గళాయ నమో నమః॥ 21

నమో న మసనం శంభో! నిరాకారాయతే నమః।
నిర్గుణం నిష్క్రియం శాన్తమిత్యాద్యాః శ్రుతయోజగుః॥ 22

నమో2బ్రహ్మ నిరాకారం శివాయం శివ సర్వదా।
అతో2 హఞ్చ నమా భద్ర! శివాయో2 హం న సంశయః॥ 23

ఇతి శ్రీమద్ భగవత్పాద పద్మపాదాచార్య విరచితం
శ్రీ శివపఞ్చాక్షరీభాష్యమ్
సమాప్తమ్



# బిల్వాష్టోత్తర శతనామ స్తోత్రమ్

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చ త్ర్యాయుధం ।
త్రి జన్మ పాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 1

**అర్థము** :- త్రిదళం = మూడు రేకులు కలదియు; త్రిగుణాకారం = సత్త్వ రజ స్తమోగుణములను సూచించెడి ఆకారము కలదియు; త్రినేత్రం = మూడు రేకులే మూడు కన్నులుగా కలదియు; త్రి + ఆయుధం = మూడు రేకులే మూడు మొనలుగాగల ఆయుధమైనదియు; త్రిజన్మ పాప సంహారం = మూడు జన్మముల యందలి పాపములను తొలగించునదియు; అయిన; ఏకబిల్వం = ఒక మారేడు పత్రమును; శివ = శివునికి; అర్పణం (కరోమి) = అర్పించు చున్నాను.

**తాత్పర్యము** :- మూడు రేకులు గలిగి, మూడు గుణములను సూచించు నదై, మూడు కన్నులు కలిగి మూడు మొనలతో త్రిశూలము వలె ఉండి మూడు జన్మముల పాపములను తొలగించెడు బిల్వ పత్రము నొకదానిని శివునికి సమ ర్పించు చున్నాను. (బిల్వ పత్రము శివునికి ప్రీతి పాత్రము. అందుకే బిల్వ పత్రములతో శివునికి పూజ చేయుదురు)

శ్లో॥ త్రిశాఖైర్ బిల్వపత్రైశ్చ అచ్ఛిద్రై: కోమలై: శుభై: ।
తవ పూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్ ॥ 2

**అర్థము :-** త్రిశాఖై: = మూడుగా విడిన; అచ్ఛిద్రై: = కన్నములు లేనివియు; కోమలై: = సుకుమారము లైనవియు; శుభై: = మంగళకరము లైనవియు; బిల్వ పత్రై: + చ = మారేడాకులతో; తవ + పూజాం = నీ యొక్క పూజను; కరిష్యామి = చేయుదును; ఏకబిల్వమ్ = ఒక మారేడు పత్రమును; శివ + అర్పణం = శివా! నీకు సమర్పించు చున్నాను.

**తాత్పర్యము :-** చినుగులు కాని రంధ్రములు కాని లేని, సుకుమారములైన, మంగళకరములయిన, మూడు రేకులుగా విడియున్న బిల్వపత్రములతో నీకు పూజ చేయుదును. శివా! నీకు ఒక బిల్వ పత్రమును సమర్పించు చున్నాను.

శ్లో॥ సర్వత్రైలోక్య కర్తారం సర్వత్రైలోక్య పాలనం ।
సర్వత్రైలోక్య హర్తారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 3

**అర్థము :-** సర్వ + త్రైలోక్య + కర్తారం = సమస్తమయిన మూడు లోకములను సృష్టించువానిని; సర్వత్రైలోక్య పాలనం = సమస్తమైన మూడులోకములను పాలించు వానిని; సర్వత్రైలోక్య హర్తారం = సమస్తమైన మూడు లోకములను హరించువానిని; (స్తువన్ = స్తోత్రము చేయుచు) ఏకబిల్వం = ఒక బిల్వ పత్రమును; శివార్పణమ్ = శివునికి అర్పించు చున్నాను.

**తాత్పర్యము :-** మూడు లోకములకు జనకుడును, పోషకుడును, లయ

కారుడును అయిన వానిని స్తోత్రము చేయుచు శివా! నీకు బిల్వ పత్రము నొకదానిని సమర్పించుచున్నాను.

(విశేషము :- శివ + అర్పణం అన్నప్పుడు శివునికి అర్పించు చున్నానని అర్థము చెప్ప వచ్చును. అట్లు కాక 'శివ = ఓ శివా' అని సంబుద్ధిగా స్వీకరించి 'అర్పణం' అర్పణము చేయు చున్నాను. రెండు విధములుగాను కూడ "కరోమి" అను క్రియారూపము అధ్యాహృతము కావలెను. అట్లే మొదటి విశేషణములు మూడును శివునికి అన్వయించుచున్నవి. కావున త్రిలోకము లకును కర్తయు భర్తయు హర్తయునైన నిన్ను స్తోత్రము చేసి శివా! నీకు బిల్వ పత్రము నొకదానిని సమర్పించుచున్నాను. అని చెప్పుట జరుగుచున్నది. అందువల్ల పాఠకుడు 'స్తువన్ = స్తోత్రం చేసి' అన్న భావమును కలుపు కొనవలయును. మొదటి శ్లోకములో బిల్వ పత్రమునకు, పరమేశ్వరునికి అభేదాధ్యవసాయమును పరిగణింప వచ్చును. కాని రెండవ శ్లోకమునుండియే ఆ క్రమము మారినది. కావున 'స్తువన్' అని అధ్యవసాయము చేసికొనుట అవసర మగుచున్నది.)

**శ్లో॥ నాగాధిరాజ వలయం నాగహారేణ భూషితం ।**
**నాగ కుండల సంయుక్తం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 4**

**అర్థము :-** నాగాధిరాజ వలయం = సర్పరాజును కంకణముగా ధరించిన వానిని; నాగహారేణ = సర్పహారము చేత; భూషితం = అలంకరింప బడినవానిని; నాగకుండల సంయుక్తం = పాములను కర్ణాభరణములుగా కలిగి యున్నవానిని ......... ॥

**తాత్పర్యము :-** శివుడు భుజంగ భూషణుడు. కావుననే హస్త కంకణముగా సర్పరాజును ధరించి యున్నాడు. అట్లే మరియొక సర్పమును కంఠహారముగా

అలంకరించుకొనియున్నాడు. మరి రెండు సర్పములను కర్ణకుండలములుగా స్వీకరించి యున్నాడు. అందువలననే సాధకుడు ఆయా భూషణము లతో ఉండి సాక్షాత్కరించి యున్న శివుని స్తోత్రము చేయుచు 'శివా! బిల్వపత్రము నొకదానిని సమర్పించు చున్నా'నని చెప్పుచున్నాడు. (దర్శనమును బట్టి వర్ణన. భక్తిని బట్టి మారేడు పత్ర సమర్పన. ఈ రెండును ఏకకాలమున జరుగుచున్నవని తాత్పర్యము. ఇంక ముందు సైతము ఇట్లే సమన్వయము చేసికొనవలెను.)

**శ్లో॥ అక్షమాలాధరం రుద్రం పార్వతీ ప్రియవల్లభం ।**

**చంద్ర శేఖర మీశానం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 5**

**అర్థము :-** అక్షమాలాధరం = అక్షమాలను ధరించినవానిని; రుద్రం = రోదించువారి దు:ఖమును మాన్పి ఆనందమును కలిగించువానిని; పార్వతీ ప్రియవల్లభం = పార్వతీ ప్రాణే శ్వరుడైన వానిని; చంద్రశేఖరం = చంద్రుని శిరో భూషణముగా ధరించినవానిని; ఈశానం = ఈశ్వరుడవైన నిన్ను ...... ॥

**తాత్పర్యము :-** శివా! నీవు అక్షమాలను ధరించి యున్నావు. దు:ఖించువారి దు:ఖమును తొలగించి ఆనందము నందించెదవు. పార్వతికి ప్రియ వల్లభుడవు. చంద్రుని శిరోభూషణముగా ధరించి యున్నావు. అట్టి ఈశ్వరుడవైన నిన్ను స్తోత్రము చేయుచు నీకు బిల్వపత్రమును సమర్పణ చేయు చున్నాను.

**శ్లో॥ త్రిలోచనం దశభుజం దుర్గాదేహార్ధ ధారిణం ।**

**విభూత్యభ్యర్చితం దేవం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 6**

**అర్థము :-** త్రిలోచనం = మూడు కన్నులు గలవానిని; దశభుజం = పది బాహువులు గలవానిని; దుర్గా దేహార్ధధారిణం = పార్వతీ దేవిని శరీరార్ధమునందు ధరించు వానిని; విభూతి + అభి + అర్చితం = విభూతితో మిక్కిలి అర్చింప బడినవానిని; దేవం = ప్రకాశమయుడైన దేవుని ....॥

**తాత్పర్యము :-** త్రినేత్రుడవు, దశ భుజుడవు, అర్ధ నారీశ్వరుడవు, విభూతి చేత పూజింపబడు వాడవు, ప్రకాశమానుడవైన దేవుడవు అయిన నిన్ను స్తోత్రము చేయుచు శివా! నీకు బిల్వ పత్రము నొకదానిని సమర్పించు చున్నాను.

**శ్లో॥ త్రిశూల ధారిణం దేవం నాగాభరణ సుందరం ।**
**చంద్రశేఖర మీశానం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 7**

**అర్థము :-** త్రిశూలధారిణం = త్రిశూలమనెడి మూడు మొనల ఆయుధమును ధరించినవానిని, దేవం = క్రీడాపరాయణు డయిన వానిని; నాగాభరణ సుందరం = సర్పములనే అలంకారములుగా ధరించి శోభించువానిని; చంద్రశేఖరం = చంద్రుని శిరోభూషణముగా ధరించిన వానిని; ఈశానం = ఈశ్వరుని ...... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు త్రిశూలమును ధరించి యున్నావు. సర్ప భూషణములతో అలంకరింపబడి యున్నావు. నట రాజువై నాట్యము చేయుచున్నావు. చంద్రుని శిరోభూషణముగా ధరించి యున్నావు. నీవే యీశ్వరుడవు. ఈ విధముగా నిన్ను స్తోత్రము చేయుచు నీకు బిల్వ పత్రమును సమ ర్పించు చున్నాను. (అయిదవ శ్లోకము నందలి ఉత్తరార్ధమే యిచట పునరుక్తమయినది.)

శ్లో॥ గంగాధరాంబికా నాథం ఫణికుండల మండితం ।
కాల కాలం గిరీశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 8

**అర్థము** :- గంగాధర = గంగను ధరించిన; శివ = ఓ శివా; అంబికా నాథం = జగదంబికయైన పార్వతీ దేవికి ప్రాణనాథుడైన వానిని; ఫణి కుండల మండితం = పాములనెడి కర్ణ కుండలముల చేత అలంకరింపబడిన వానిని; కాలకాలం = యమునికి యముడైన వానిని; గిరీశం = కైలాస గిరికి ప్రభువైనవానిని ..... ॥

**తాత్పర్యము** :- ఓ గంగాధరా! ఓ హరా! జగన్మాతయైన పార్వతీ దేవికి ప్రాణవల్లభుడవును, పాములనే కర్ణకుండలములుగా అలంకరించు కొనినవాడవును, మార్కండేయుడనెడి భక్తుని కాపాడుట కొరకై యమునికై యమునిగా ప్రవర్తించిన వాడవును, కైలాస గిరీశ్వరుడవు అయిన నిన్ను దర్శించుచు స్తుతించుచు నీకు ఒక బిల్వ పత్రమును పూజా పత్రముగా సమర్పించుచున్నాను.

శ్లో॥ శుద్ధ స్ఫటిక సంకాశం శితికంఠం కృపానిధిం ।
సర్వేశ్వరం సదా శాంతం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 9

**అర్థము** :- శుద్ధస్ఫటికసంకాశం = శుద్ధమైన స్ఫటికము వంటి వానిని; శితికంఠం = నల్లని కంఠము గలవానిని; కృపానిధిం = దయకు గని వంటి వానిని; సర్వేశ్వరం = సర్వమునకు ప్రభువైన వానిని; సదా శాంతం = ఎల్లప్పుడును శాంత ముగా ఉండువానిని .... ॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు శుద్ధ స్ఫటికము వలె తెల్లని శరీరము గల

వాడవు; నల్లని మెడగల వాడవు (హాలాహల భక్షణము చేత కంఠము నల్లగా మాడిపోయినది. అంతర్గత బహిర్గతలోకముల రక్షణకై శివుడు హాలాహలమును త్రాగి కంఠము నందే నిలుపుకొనెను). ఈ సన్నివేశము నీ దయా పరత్వమునకు నిదర్శనము. నీవు సర్వలోకములకు సర్వ కాలములకు ఈశ్వరుడవు. ఎల్లప్పుడును శాంతముగా ఉండుటయే నీ స్వభావము. ఇట్టి నిన్ను దర్శించుచు నీకొక బిల్వపత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ సచ్చిదానంద రూపం చ పరానందమయం శివం ।**
**వాగీశ్వరం చిదాకాశం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 10**

**అర్థము :-** శివ = ఓ శివా; సత్ + చిత్ + ఆనందరూపం = శాశ్వతమును చైతన్యాత్మకమును ఆనందమును అయిన రూపముగల వానిని; చ = మరియు; పర + ఆనంద మయం = ఉత్తమమైన ఆనందమే స్వరూపముగా గలవానిని; శివం = మంగళకరమైన వానిని; వాక్ + ఈశ్వరం = వాక్కులను తన అధీనమునందుంచుకొను వానిని; చిత్ + ఆకాశం = చైతన్యయుక్తమైన జ్ఞానము చేత సర్వత్ర ప్రకాశించు వానిని ..... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు సచ్చిదానందరూపుడవు. ఉత్తమమైన ఆనందమే నీవు. నీవు మంగళకరుడవు. వాక్కులకు ఈశ్వరుడవు; నీ అనుమతిలేనియెడల మా నోట వాక్కులు వెలువడవు. చిచ్ఛక్తి చేత నీవు అంతటను ప్రకాశించు చున్నావు. చిన్మయుడవు నీవు. ఇట్టి నిన్ను దర్శించుచు మారేడు రేకును నీకు పూజాదళముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ శిపివిష్టం సహస్రాక్షం దుందుభ్యం చ నిషంగిణం ।**
**హిరణ్యబాహుం సేనాన్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 11**

**అర్థము :-** శిపివిష్టం = పశువులయందు వ్యాప్తి పొందిన వానిని; సహస్ర + అక్షం = వెయ్యి (అనేకమయిన) కన్నులు గలవానిని; దుందుభ్యం = ఢక్కా కలిగిన వానిని; చ = మరియు; నిషంగిణం = అమ్ముల పొది గలవానిని; హిరణ్య బాహుం = బంగారు చేతులు గల వానిని; సేనాన్యం = సేనాధిపతిని గలవానిని ..... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు పశుపతివి; నీవు సహస్రాక్షడవు; ఢక్కాను మ్రోగించు వాడవు. (శివుడు నటరాజు. సంధ్యాసమయ మందు ఢక్కా మ్రోగించుచు నాట్యము చేయును.) అమ్ములపొది గలవాడవు (ఈశ్వరుడు తన బాణములచేత భక్తుల పాపములను కొట్టివేయును. అర్జునుడు పాశుపత సంపాదనార్థము తపస్సు చేయుచుండగా కిరాత వేషుడైన శివుడు అమ్ముల పొదిని ధరించి యుండెను.) నీవు బంగారు బాహువులను గలవాడవు. నీవు సేనానిని గల వాడవు. (దేవతలకు సేనాధిపతిగా కుమారస్వామిని అను గ్రహించినవాడు శివుడు). ఇట్టి నిన్ను దర్శించి ఒక బిల్వపత్రముతో పూజించు చున్నాను.

**శ్లో॥ అరుణం వామనం తారం వాస్తవ్యం చైవ వాస్తువం ।**
**జ్యేష్ఠం కనిష్ఠం వైశంతం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 12**

**అర్థము :-** అరుణం = ఎఱ్ఱని వానిని; వామనం = సుందరుడైన వానిని; తారం వాస్తవ్యం = వెండి కొండ యందు నివసించు వానిని; వాస్తువం = వాస్తు కళ యందు కుశలుడైన వానిని; జ్యేష్ఠం = దేవతలలో పెద్దయైన వానిని; కనిష్ఠం = కఠినమైన నిష్ఠ గలవానిని; వైశంతం = దుష్టులను సంహరించు వానిని.... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు లోహిత శరీరుడవు. సుందరుడవు. రజతాచలవాసివి. వాస్తు కళా ప్రవీణుడవు. దేవతలలో జ్యేష్ఠుడవు. కఠినమయిన నిష్ఠ కలవాడవు. దుష్టులను సంహరించు వాడవు. ఇట్టి నిన్ను దర్శించుచు స్తుతించుచు నీకు బిల్వ పత్రమును పూజాపత్రముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ హరికేశం సనందీశం ఉచ్చైర్ ఘోషం సనాతనం ।**

**అఘోర రూపకం కుంభం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 13**

**అర్థము :-** శివ = ఓ శివా; హరి + క + ఈశం = విష్ణు మూర్తికి బ్రహ్మకు ప్రభువైన వానిని; స + నందీశ్వరం = నందీ శ్వరుని కలిగియున్నవానిని; ఉచ్చై: + ఘోషం = బిగ్గరగా ధ్వని చేయు వానిని; సనాతనం = ఆద్యంతములు లేక ఎల్లప్పుడు నుండు వానిని; అఘోర రూపకం = మిక్కిలి భయంకరమైన రూపము గలవానిని; కుంభం = భూమి నంతటిని నిండి యున్నవానిని ..... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు విష్ణుమూర్తికిని విరించికిని ప్రభుడవు. నీ వాహనమైన నందీశ్వరునితో కూడి యున్నవాడవు. ఉన్నతమైన పిలుపుగలవాడవు. ఆద్యంతములు లేనివాడవు కాబట్టి సనాతనుడవు. నీవు శివుడవే అయినప్పటికి మంగళరూపమును విడిచి భయంకరరూపమును ధరించి కొన్నివేళలందు ఉగ్రుడ వగుదువు. నీవు సర్వవ్యాపకుడ వగుటచేత భూమియంతయు నీతో నిండియుండును. ఇట్టి నిన్ను భావించుచు దర్శించుచు పూజా పత్రముగా నీకు బిల్వపత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ పూర్వజావరజం యామ్యం సూక్ష్మతస్కరనాయకం ।**

**నీలకంఠం జఘన్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 14**

**అర్థము** :- పూర్వజ + అవరజం = పూర్వము పుట్టిన వానిని అనంతర మందు పుట్టిన వానిని; యామ్యం = యమము కలిగిన వానిని; సూక్ష్మ తస్కరనాయకం = సూక్ష్మ రూపమున తస్కర నాయకుడై సంచరించు వానిని; నీలకంఠం = నల్లని మెడ గలవానిని; జఘన్యం = దిసమొల గల వానిని........ ॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు సృష్టికి పూర్వమే యుంటివి. అందువలన నీకు పుట్టుక యున్నదో లేదో తెలియదు. భవశబ్దము చేత పుట్టుక యున్నదనుకొన్నయెడల అదియెంత పూర్వమో తెలియదు. అందువల్లనే నీవు పూర్వజుడవు. భక్త రక్షణ నిమిత్తము ఇప్పటి కెన్ని పర్యాయములు జనించితివో! ఈ అవతారముల వలన నీవు అవరజుడవు. నీవు యమ నియమాదుల గలిగిన యతివి. నీవు దొంగలకు నాయ కుడవు. మాలో ఉన్న దుర్గుణములను దోచుకొనుటకై నీవు సూక్ష్మరూపమున దొంగలనాయకుని వలె వత్తువు. మమ్ములను గుణయుక్తులను చేయుటకే నీ తస్కర నాయకత్వము. హరశబ్దము చేత సైతము ఇదియే స్ఫురించు చున్నది. పరోపకారమునకై హాలాహలమును మ్రింగుట చేత నీ మెడ నల్లనైనది. నీకు దిక్కులే వస్త్రము లగుటచేత నీవు దిగంబరుడవైతివి. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వ పత్రమును పూజాపత్రముగా సమర్పించి సేవించు చున్నాను.

**శ్లో॥ సురాశ్రయం విషహరం వర్మిణం చ వరూథినం ।**
**మహాసేనం మహావీరం ఏక బిల్వం శివార్పణమ్ ॥ 15**

**అర్థము** :- సురాశ్రయం = దేవతలకు ఆశ్రయమైన వానిని; విషహరం = విషమును హరించిన వానిని; విషహరం = విషమును హరించిన వానిని; చ

= మరియు, వర్మిణం = కవచము కల వానిని, వరూధినం = సైన్యము గలవానిని; మహాసేనం = గొప్ప సేనలను కలిగిన వానిని, మహావీరం = గొప్ప వీరులను కలిగిన వానిని..... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు దేవతలకు ఆధారమైన వాడవు; సముద్ర మథన సమయమున పుట్టిన కాలకూటవిషమును మ్రింగి వేసి సర్వ లోకములను కాపాడినవాడవు; కవచము ధరించి, మహాసైన్యములను కలిగి, సేనాధిపతులను కలిగి స్వయ ముగా మహావీరుడవై యున్నవాడవు. ఇట్టి నిన్ను భావించుచు మారేడు పత్రమును నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ కుమారం కుశలం కూప్యం వదాన్యం చ మహారథం ।**
**తౌర్యత్రయం చ దేవం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 16**

**అర్థము :-** కుమారం = యౌవనవంతుని, కుశలం = నేర్పుగల వానిని; కూప్యం = గుహ్యముగా నుండు వానిని; వదాన్యం = దాతృత్వము గల వానిని, చ = మరియు; మహారథం = మహారథము కలిగిన వానిని; తౌర్య త్రయం = నృత్త గీతవాద్యములను గల వానిని; దేవం = దేవుని ..... ॥

**తాత్పర్యము :-** శివా! నీవు నిత్యయౌవనుడవు; సర్వకార్యప్రవీణుడవు; గుహ్యముగా నుండువాడవు; గొప్పదాతవు. త్రిపురాసుర సంహార సమయమున భూమినే రథముగా ఉపయోగించు కొన్న మహారథికుడవు. నీవు మహా నటుడవు; నటరాజవు. నృత్తగీతవాద్యములనెడి తౌర్యత్రయమును గలవాడవు. దేవదేవుడవు, ఇట్టి నిన్ను దర్శించుచు బిల్వపత్రమును సమర్పించి అర్చించు చున్నాను. ('తౌర్యాతౌర్యం' అను పాఠాంతరము కంటె "తౌర్యత్రయం" సుగమము).

**శ్లో॥ దశకర్ణం లలాటాక్షం పంచవక్త్రం సదాశివం ।**
**అశేష పాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 17**

**అర్థము** :- దశకర్ణం = పదిచెవులు గలవానిని; లలాటాక్షం = నొసట అనలనేత్రమును గలవానిని; పంచవక్త్రం = అయిదు ముఖములు కలవానిని; సదాశివం = ఎల్లప్పుడును శుభములు కలిగించువానిని; అశేష పాప సంహారం = సర్వపాపములను నశింపజేయు వానిని ..... ॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీకు పదిచెవులు కలవు; ఫాలభాగమునందు అగ్నినేత్రము కలదు; అయిదు ముఖములు గలవు. ఎల్లప్పుడును శుభ రూపుడవై శుభములనే నీవు కలిగింతువు. సర్వపాపములను సమూలముగా నశింపజేయుదువు. ఇట్టి నిన్ను ధ్యానించుచు, నీకు ఒక మారేడు పత్రమును పూజా పత్రముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ నీలకంఠం జగద్వంద్యం దీననాథం మహేశ్వరం ।**
**మహాపాపహరం శంభుం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 18**

**అర్థము** :- నీలకంఠం =నల్లని మెడగలవానిని; జగత్ + వంద్యం = సర్వప్రపంచమునకు వందనీయుడైన వానిని; దీన నాథం = అనాథులకు రక్షకుడైనవానిని; మహేశ్వరం = మహేశ్వరు డన్న సార్థకనామము గలవానిని; మహా పాపహరం = మహాపాతకములను సైతము నశింప జేయువానిని; శంభుం = సుఖమునకు జన్మ స్థానమైన వానిని ...... ॥

**తాత్పర్యము** :- శివా! హాలాహలభక్షణము చేత నీ తెల్లని కంఠము నల్లగా

అయినది. అప్పటినుండి నీకు నీలకంఠుడన్న నామ మేర్పడినది. నీవు చేసిన ఉపకారము సర్వజగత్తులను రక్షించునది. అందువల్లనే సర్వలోకములకు నీవు వందనీయుడ వైతివి; ఆర్తుల ఆర్తిని పోగొట్టి ఆదుకొను వాడవు నీవు. ("దీనానాథం" అని అన్నచో దీనులను, అనాథులను కలిగి ఉన్నవాడవు. అనగా వారికి ఆశ్రయ మిచ్చి రక్షించు వాడవు అని అర్థము చెప్పుకొన వలయును). నీవు సర్వాధికుడ వగుటచేత మహేశ్వరుడన్న సార్థక నామ ధేయము గలవాడవు. మహాపాపములను సైతము తొలగింతువు. ఆ విధ ముగా సుఖమును శాంతిని కలి గింతువు. ఇట్టి నిన్ను భావించుచు నీకు బిల్వదళమును సమర్పణము చేయు చున్నాను.

**శ్లో॥ చూడామణీకృత విధుం వలయీకృత వాసుకిం ।**
**కైలాస నిలయం భీమం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 19**

**అర్థము** :- చూడామణీ కృత విధుం = చంద్రుని శిరోభూషణముగా చేసికొన్నవానిని; వలయీకృత వాసుకిం = వాసుకిని కంకణ ముగా చేసి కొన్నవానిని; కైలాస నిలయం = కైలాసమందు నివసించు వానిని; భీమం = భయము గొల్పువానిని ... ॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు చంద్రుని అనుగ్రహించి శిరోభూషణముగా ధరించితివి. సర్పరాజయిన వాసుకిని కంకణముగా ధరించితివి. కైలాస పర్వతమును నివాస స్థానముగా అనుగ్రహించితివి. శివుడవే అయినప్పటికి సాధులను హింసించు దుష్టులను శిక్షించుటకై భయంకరరూపమును ధరించితివి. ఇట్టి నిన్ను భావించుచు మారేడు పత్రమును నీకు పూజా పత్రముగా సమర్పించి అర్చించు చున్నాను.

శ్లో॥ కర్పూర కుంద ధవళం నరకార్ణవ తారకం ।

కరుణామృత సింధుం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 20

**అర్థము :-** కర్పూర కుంద ధవళం = కర్పూరమువలె; మల్లె పువ్వువలె తెల్లనైన వానిని; నరక + అర్ణవ తారకం = సముద్రము వంటి నరకమును దాటించు వానిని; కరుణామృత సింధుం = దయయనెడి అమృతమునకు సముద్రమువంటి వానిని .... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీ శరీరము కర్పూరమువలె, మల్లె పువ్వువలె (మొల్ల పువ్వువలె) తెల్లని వన్నె గలది. సముద్రమువలె విశాల మయిన నరకము నుండి నీవు నీ భక్తులను దాటింతువు. నీ దయయనెడి అమృతము సముద్రమువలె అపారమైనది. ఇట్టి విశేషములు కల్గిన నిన్ను ధ్యానించుచు నీకు మారేడు దళమును సమర్పించు చున్నాను.

శ్లో॥ మహాదేవం మహాత్మానాం భుజంగాధిప కంకణం ।

మహాపాపహరం దేవం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 21

**అర్థము :-** మహాదేవం = మహాదేవుని; మహాత్మానం = మహాత్ముని; భుజంగాధిప కంకణం = సర్పరాజును కంకణముగా ధరించిన వానిని; మహాపాపహరం = మహాపాపములను సైతము నశింపజేయువానిని; దేవం = ప్రకాశమానుడైన వానిని; (ఉత్తరార్ధము పునరుక్తమైనది.) ....... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు దేవజ్యేష్ఠుడవు. కావున మహాదేవుడవు. అఖండమైన ఆత్మ స్వరూపుడవు. కావున మహాత్ముడవు. సర్పరాజయిన

వాసుకిని కంకణముగా గ్రహించి అను గ్రహించినవాడవు. మహాపాపములను సైతము నశింప జేసెడివాడవు. ఆయాగుణవిశేషముల చేత ప్రకాశించు వాడవు. అట్టి నిన్ను దేవదేవా! శివా! మనసులో సాక్షాత్క రింపజేసికొనుచు నీకు బిల్వపత్రమును సమర్పించి నిన్ను అర్చించు చున్నాను.

(మానవులు పాపములు అజ్ఞానముచేతనో, అహంకారము చేతనో చేయుదురు. అంతమాత్రము చేత నిష్కృతి లేదని నిస్పృహ చెందవలసిన అవసరములేదు. భగవంతుని శరణుచొచ్చుటచేత మహాపాపములు సైతము నశించును.)

**శ్లో॥ భూతేశం ఖండపరశుం వామదేవం పినాకినం ।**
**వామే శక్తిధరం శ్రేష్ఠం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 22**

**అర్థము :-** భూత + ఈశం = భూతనాథుని; ఖండపరశుం = గొడ్డలిని ఆయుధముగా ధరించిన వానిని; వామదేవం = వామదేవుడను పేరుగల వానిని; పినాకినం = పినాకమనెడి ధనుస్సును గలవానిని; వామే = ఎడమ భాగమునందు; శక్తి ధరం = పార్వతిని ధరించియున్నవానిని; శ్రేష్ఠం = ఉత్తమోత్తముని ... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు సర్వభూతములకు అధిపతివి; గండ్రగొడ్డలిని ఆయుధముగా ధరించి ఖండపరశువనెడి నామమును బడసినవాడవు. వామ దేవుడనెడి సౌందర్య స్ఫోరకమయిన పేరు గలవాడవు. పినాక మనెడి ధనుస్సును ధరించిన వాడవు. ఎల్లప్పుడును నీ యెడమ భాగమునందు పార్వతీదేవిని ధరించి అర్ధనారీశ్వరుడన్న అభిధానమును సంపా

ంచుకొన్నవాడవు. అందరిలోను అగ్రగణ్యుడవు. అట్టి నిన్ను భావించుచు బిల్వపత్రముతో అర్చించు చున్నాను.

**శ్లో॥ ఫాలేక్షణం విరూపాక్షం శ్రీ కంఠం భక్తవత్సలం ।**

**నీలలోహిత ఖట్వాంగం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 23**

**అర్థము :-** ఫాలేక్షణం = లలాటనేత్రుని; విరూపాక్షం = విషమ లోచనుని; శ్రీ కంఠం = నీలకంఠుని; భక్తవత్సలం = భక్తులయందు వాత్సల్యము గలవానిని; నీల లోహిత ఖట్వాంగం = నల్లని యెఱ్ఱని వర్ణములు గల మంచపుకోడు ఆయుధముగా గల శివుని .......... ॥

**తాత్పర్యము :-** నొసట నేత్రముగలవానిని, సమములు గాని కన్నులు కలవానిని; (రెండు నాలుగు మొదలయినవి సమసంఖ్యలు. మూడు విషమము. అంతే కాక రెండు కన్నులు సమ క్రమములో ఉండగా ఒకటి అడ్డము తిరిగి యుండును. అదియే విరూపాక్షత్వము. హాలాహలము చేత నల్లబడిన కంఠము గలవానిని; భక్తులయందు వాత్సల్యము గలవానిని; నల్లని యెఱ్ఱని వర్ణములు గల మంచపుకోడు ఆయుధముగాగల శివుని స్తోత్రము చేయుచు మారేడు పత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ కైలాస వాసినం భీమం కఠోరం త్రిపురాంతకం ।**

**వృషాంకం వృషభారూఢం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 24**

**అర్థము :-** శివ = ఓ శివా; కైలాసవాసినం = కైలాసమున నివసించు వానిని; భీమం = భయంకరుడైన వానిని; కఠోరం = కఠినుడైనవానిని; త్రిపురాంతకం = త్రిపురాసురులను నాశనము చేసిన వానిని; వృషాంకం =

వృషభమును ధ్వజ చిహ్నముగా గలవానిని; వృషభ + ఆరూఢం = ఎద్దును అధిరోహించు వానిని ...... ॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు కైలాస వాసివి; భయంకరుడవు (భీమేశ్వర నామధేయుడవు); కఠినుడవు; త్రిపురాసురులను సంహా రించి వారి పట్టణములను దగ్ధమొనరించినవాడవు. వృషభ ధ్వజుడవు. వృషభవాహనుడవు. ఇట్టి నిన్ను సందర్శించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించెదను.

**శ్లో॥ సామప్రియం సర్వమయం భస్మోద్ధూళిత విగ్రహం ।**

**మృత్యుంజయం లోకనాథం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 25**

**అర్థము** :- సామప్రియం = సామగానమునందు ప్రేమగలవానిని; సర్వమయం = సర్వము నందు నిండియున్న వానిని; భస్మ + ఉద్ధూళిత విగ్రహం = విభూతిని వెలువరించుచున్న శరీరము గలవానిని; మృత్యుం జయం = యముని జయించిన వానిని; లోకనాథం = సర్వలోకములకు ప్రభువైన వానిని .... ॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు సామగాన ప్రియుడవు; సర్వమయుడవు; నీ శరీరమునుండి విభూతి వెలువడుచుండును. నీవు యముని తిరస్కరించి మృత్యుంజయుడవైతివి; నీవు జగన్నాథుడవు; జగద్రక్షకుడవు. ఇట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వ పత్రముతో పూజ చేయుచున్నాను.

**శ్లో॥ దారిద్ర్య దు:ఖ హరణం రవి చంద్రానలేక్షణం ।**

**మృగపాణిం చంద్రమౌళిం ఏకబిల్వం శివార్పణమ్॥ 2**

**అర్థము :-** శివ = ఓ శివా; దారిద్ర్య దు:ఖ హరణం = దారిద్ర్యమనే దు:ఖమును హరించు వానిని; రవి చంద్ర + అనల + ఈక్షణం = సూర్యుడు చంద్రుడు అగ్ని అనెడి కన్నులు గలవానిని; మృగపాణిం = చేతియందు మృగమును ధరించినవానిని; చంద్రమౌళిం = శిరస్సునందు చంద్రుని ధరించిన వానిని .................... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు పేదరికమును, అందు వలన కలిగెడి దు:ఖమును తొలగించెదవు. నీకు సూర్యుడును, చంద్రుడును, అగ్నియు మూడు కన్నులు. నీవు చేతి యందు జింకను ధరించియున్నావు. నీవు శిరస్సునందు చంద్రుని ధరించి యున్నావు. ఇట్టి నిన్ను భావన చేయుచు మారేడు దళముతో అర్చించు చున్నాను.

**శ్లో॥ సర్వలోక భయాకారం సర్వలోకైక సాక్షిణం ।**
**నిర్మలం నిర్గుణాకారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 27**

**అర్థము :-** సర్వలోకభయాకారం = సర్వలోకములకు భయమును కలిగించు రూపము గలవానిని; సర్వలోక + ఏకసాక్షిణం = సర్వలోకములకు ఒకే యొక సాక్షియైన వానిని; నిర్మలం = పరిశుద్ధుడైన వానిని; నిర్గుణ + ఆకారం = నిర్గుణుడును నిరాకారుడు నైనవానిని; ........॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు సర్వలోకములకు భీతి పుట్టించెడి రూపము గలవాడవు. సర్వలోకములకు ఏకైక సాక్షివి నీవు. నీలో ఏ విధమయిన కళంకమును లేదు. నిజమునకు నీవు గుణరహితుడవు. రూపరహితుడవు. (భక్తుల అభీష్టమును బట్టి ఆయాగుణములతో ఆయారూపములతో దర్శనము దయచేసెదవు) అట్టి నిన్ను స్తోత్రము చేయుచు మారేడు పత్రమును సమర్పించి అర్చించెదను.

శ్లో॥ సర్వతత్త్వాత్మకం సాంబం సర్వతత్త్వ విదూరకం ।

సర్వతత్త్వ స్వరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 28

**అర్థము :-** సర్వతత్త్వాత్మకం = సర్వతత్త్వములతో కలిసి యున్న వానిని; స + అంబం = పార్వతీ సహితుడైన వానిని; సర్వతత్త్వవిదూరకం = సర్వ తత్త్వములను దూరముగా నిలుపువానిని; సర్వతత్త్వ స్వరూపం చ = సర్వతత్త్వములకు రూపమై యున్న వానిని ...... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! సర్వతత్త్వములును నీ ఆత్మ స్వరూపమే. అంబాసహితుడవై నీవు సాంబశివుడవని కీర్తింపబడు చున్నావు. సర్వ తత్త్వములకు నీవు దూరస్థుడవు. సర్వ తత్త్వలయొక్క రూపమే నీవు. ('భగవంతుడు తదంతికే తద్దూరే' అని ఉపనిషత్తులందు పరస్పర విరుద్ధముగా చెప్పబడెను. 'యత్ర వాచో నివర్తన్తే మనసా సహ' అని చెప్పుట అందువల్లనే.) అట్టి నిన్ను భావించుచు మారేడు పత్రమును నీకు పూజా పత్రముగా సమర్పించెదను.

శ్లో॥ సర్వలోక గురుం స్థాణుం సర్వలోక వరప్రదం ।

సర్వలోకైక నేత్రం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 29

**అర్థము :-** సర్వలోక గురుం = సమస్తలోకములకు గురు స్థానీయుని; స్థాణుం = ఆదినుండి తుది వరకు స్థిరముగా నుండు వానిని; సర్వలోక వరప్రదం = సమస్తలోకములకు వరములను ప్రసాదించు వానిని; సర్వలోక + ఏకనేత్రం = సర్వలోకములకు ఒకే యొక దృష్టిగా పనిచేయు వానిని ... ॥

**తాత్పర్యము :-**సర్వలోకములకు గురుస్థానీయుడవై నీవే అంధకారము

నుండి వెలుగులోనికి నడిపించు చున్నావు. చలనములేని స్థాణుడవు నీవు; ఆద్యంతములు లేని వాడవు. సర్వలోకము లకు వరములను ప్రసాదించు వాడవు. నీవే సర్వలోకము లకు దృష్టివై ముందునకు నడిపించు వాడవు. ఇట్టి నిన్ను స్తుతించుచు బిల్వ దళముతో అర్చించు చున్నాను.

శ్లో॥ మన్మథోద్ధరణం శైవం భవభర్గం పరాత్మకం ।
కమలాప్రియ పూజ్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 30

**అర్థము :-** మన్మథ + ఉద్ధరణం = మన్మథుని ఉద్ధరించిన వానిని; శైవం = మంగళకరుడైన వానిని; భవభర్గం = జన్మ బంధమును నశింప జేయువానిని; పరాత్మకం = ఉన్నతోన్న తుని; కమలాప్రియ పూజ్యం = లక్ష్మీదేవికి భర్తయైన విష్ణుదేవునికి పూజనీయుడైన వానిని; .......... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు మన్మథోద్ధారకుడవు. నీ యెడ ద్రోహము చేసినప్పుడు మన్మథుని దహించితివి. పార్వతీపరిణయా నంతరము అతనిని అనంగునిగా బ్రతికించితివి. నీవు శైవుడవు; అనగా శుభములను కలిగించువాడవు. భవ బంధములను నశింపజేయు వాడవు నీవే. నీవే సర్వో న్నతుడవు. లక్ష్మీ వల్లభుడైన విష్ణువునకు సైతము నీవు పూజనీయుడవు. అట్టి నిన్ను ధ్యానించుచు శివా! నీకు బిల్వపత్రము నొకదానిని సమర్పించు చున్నాను.

శ్లో॥ తేజోమయం మహాభీమం ఉమేశం భస్మలేపనం ।
భవరోగ వినాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 31

**అర్థము :-** తేజోమయం = తేజోరూపమైన వానిని; మహాభీమం = మిక్కిలి

భయంకరమైనవానిని; ఉమా + ఈశం = పార్వతీ నాథుడైనవానిని; భస్మలేపనం = విభూతిని మై పూతగా ధరించిన వానిని; భవరోగవినాశం చ = జన్మ మరణ రూపమైన సంసార రోగమును నాశనము చేయు వానిని ..... ॥

**తాత్పర్యము** :-ఓ శివా! నీవు తేజోమయమైన శరీరము గలవాడవు. దుర్మార్గులకు మహాభయంకరుడవు. జగదంబయైన పార్వతికి వల్లభుడవు నీవు. విభూతినే మైపూతగా ధరించిన వాడవు. సంసారరూపమైన వ్యాధిని నశింపజేయువాడవు. అట్టి నిన్ను ధ్యానించుచు బిల్వ పత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ స్వర్గాపవర్గ ఫలదం రఘునాథ వరప్రదం ।**

**నగరాజ సుతాకాంతం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 32**

**అర్థము** :- స్వర్గ + అపవర్గ ఫలదం = స్వర్గమును ముక్తిని ఫలములుగా ఇచ్చు వానిని; రఘునాథ వరప్రదం = రఘువంశప్రభువైన రామునకు వరము నిచ్చిన వానిని; నగరాజ సుతా కాంతం = పర్వతరాజ పుత్రికయైన పార్వతి యొక్క భర్తను ... ....॥

**తాత్పర్యము** :- భోగభూమియైన స్వర్గమును, పునరావృత్తి రహితమైన మోక్షమును ప్రసాదించు వాడవు నీవు. రఘురామునికి రావణ విజయ కారణమైన వరమును ప్రసాదించిన వాడవు నీవు. పర్వతరాజయిన హిమ వంతుని పుత్రికయగు గౌరీ దేవికి భర్తవు నీవు. శివా! ఇట్టి నిన్ను భావించుచు బిల్వ పత్రముతో అర్చించెదను.

**శ్లో॥ మంజీర పాదయుగళం శుభలక్షణలక్షితం ।**
**ఫణిరాజ విరాజం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 33**

**అర్థము :-** మంజీర పాదయుగళం = అందెలతో అలంకరింప బడిన రెండు పాదములు గలవానిని; శుభలక్షణ లక్షితం = మంగళాత్మకములయిన చిహ్నములతో గోచరించువానిని; ఫణి రాజ విరాజం = సర్ప రాజములను అలంకారములుగా ధరించి విరాజిల్లు వానిని; ........ ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీ రెండు పాదములు మంజీర రంజితములై యున్నవి. నీ పేరునకు తగినట్లుగా మంగళకరములైన లక్షణములతో గోచరించు చున్నావు. నీవు అలంకారము లుగా సర్పరాజములను ధరించి నాగభూషణుడవై ప్రకా శించు చున్నావు. అట్టి నిన్ను తలంచుచు మారేడాకు నొకదానిని పూజాపత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ నిరామయం నిరాధారం నిస్సంగం నిష్ప్రపంచకం ।**
**తేజోరూపం మహారౌద్రం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 34**

**అర్థము :-** నిర్ + ఆమయం = ఏవిధమైన వ్యాధులును లేని వానిని; నిర్ + ఆధారం = ఏవిధమైన ఆలంబనమును లేనివానిని; నిః + సంగం = ఏ విధమైన సాంగత్యము లేనివానిని; నిష్ప్రపంచకం = ప్రపంచమే లేని వానిని; తేజోరూపం = కాంతిమయమైన శరీరము కలవానిని; మహారౌద్రం = అత్యధికమైన రౌద్రము గలవానిని...... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు నిరామయుడవు. నీవే సర్వవిశ్వమునకు

ఆధారమగుటచేత నీకు ఆధారముగా చెప్పుకొనదగిన దేదియు లేదు. నీవ విరాగివగుటవలన నీకు సంగత్వము లేదు. నీవు నిర్గుణ నిరాకారుడవైనప్పుడు జగదతీతుడవై యుందువు. అట్టి యెడ నీకు ప్రపంచము లేదు. నీవు కాంతిమయమైన శరీరము గలవాడవు. మహారుద్ర రూపుడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రమును సమర్పించి పూజించు చున్నాను.

**శ్లో॥ సర్వలోకైక పితరం సర్వలోకైక మాతరం ।**

**సర్వలోకైక నాథం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 35**

**అర్థము :-** సర్వలోక + ఏకపితరం = లోకములకన్నింటికి ఒకే యొక తండ్రియైన వానిని; సర్వలోక + ఏకమాతరం = లోకముల కన్నింటికి ఒకే యొక తల్లియైన వానిని; చ = మరియు; సర్వలోక + ఏకనాథం = లోకముల కన్నింటికి ఒకే యొక ప్రభువైన వానిని.... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! సర్వలోకములకు నీవే తండ్రివి; నీవే తల్లివి; నీవే ప్రభుడవు. ఇట్టి నిన్ను సాక్షాత్కరించుకొని బిల్వ పత్రముతో సమర్పించు చున్నాను.

**శ్లో॥ చిత్రాంబరం నిరాభాసం వృషభేశ్వర వాహనం ।**

**నీలగ్రీవం చతుర్వక్త్రం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 36**

**అర్థము :-** చిత్ర + అంబరం = చిత్రమైన వస్త్రము ధరించెడి వానిని; నిర్ + ఆ భాసం = ఆభాసము (భ్రాంతి) లేనివానిని వృషభేశ్వర వాహనం = నందీశ్వరుని వాహనముగా కల వానిని; నీలగ్రీవం = నల్లని కంఠము గలవానిని; చతుర్ + వక్త్రమ్ = నాలుగు ముఖములు గల వానిని; ......... ॥

**తాత్పర్యము :-** నీవు చిత్రాంబరుడవు శివా! ఒకప్పుడు గజ చర్మమును ధరింతువు. ఒకప్పుడు శార్దూల చర్మమును ధరింతువు. ఒకప్పుడు పట్టు వస్త్రములను కూడ ధరింతువు. ఒకప్పుడు దిగంబరుడవై యుందువు. నీవు కన్నులు పట్టలేని కాంతి సంపద కలిగియుండుటచేత అగోచరుడవై యుందువు. నీకు నందీశ్వరుడు వాహనము. నంది యనగా ఆనందము గలవాడని అర్థము. అందువలన నీవు ఆనందమునే అధిరోహించి ఆనంద దాతవై విహరింతువు. నీ నల్లని కంఠము లోకక్షేమమునకై నీవు చేసిన సాహసమునకు గుర్తు. నీవు నాలుగు వక్త్రములు గలవాడవు. పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ రూపములయిన నాలుగు వాక్కులకు నీవే మూల రూపము. ఇట్టి నిన్ను స్తోత్రము చేయుచు పూజాపత్రమును సమర్పించి సమర్చించు చున్నాను.

**శ్లో॥ రత్న కంచుక రత్నేశం రత్న కుండల మండితం ।**
**నవరత్న కిరీటం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 37**

**అర్థము :-** రత్న కంచుక రత్నేశం = రత్నములు పొదిగిన కవచము కలిగి రత్నములకు అధీశ్వరుడైన వానిని; రత్నకుండల మండితం = రత్నములు పొదిగిన కర్ణాభరణములతో అలంకరింపబడిన వానిని; చ = మరియు; నవరత్న కిరీటం = నవవిధ రత్నమయమైన కిరీటము గల వానిని........ ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు రత్నేశ్వరుడవు. అందువలననే నీ అలంకారము లన్నియు రత్నమయములే. నీవు రత్న మయమైన కవచమును ధరింతువు; చెవులను రత్న మయములైన కుండలములతో అలంకరించు కొందువు;

మౌక్తిక పద్మరాగ వజ్ర ప్రవాళ మరకత నీల గోమేధిక పుష్యరాగ వైడూర్య నామకములైన నవరత్నములు తాపిన కిరీటమును ధరింతువు. ఓ. శివా! ఇట్టి నిన్ను సాక్షాత్కరింప జేసికొని నీకు ప్రీతిపాత్రమైన బిల్వపత్రముతో నిన్ను పూజించు చున్నాను.

**శ్లో॥ దివ్య రత్నాంగులీ స్వర్ణకంఠాభరణ భూషితం ।**

**నానారత్నమణిమయం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 38**

**అర్థము** :- దివ్య రత్నాంగులీ = ప్రకాశమానమైన రత్నమయమైన ఉంగరముతోను; స్వర్ణకంఠాభరణ = బంగారు కంటెతోను; భూషితం = అలంకరింప బడినవానిని; నానా రత్న మణి మయం = అనేక రత్నములతోను మణులతోను కూడి యున్న వానిని ............ ॥

**తాత్పర్యము** :- శివా! నీవు దివ్య రత్నమయమైన ఉంగరములతో అలంకరింపబడితివి. అట్లే సువర్ణమయమయిన కంఠహారముతో అలంకరింపబడితివి. అనేక విధములయిన రత్నములతోను, మణులతోను నిండి యున్నావు. ఇట్టి నీ సర్వ సంపన్నమైన రూపమును సంభావించుచు బిల్వ పత్రముతో నిన్ను సమర్పించు చున్నాను.

**శ్లో॥ రత్నాంగుళీయ విలసత్ కరశాఖానఖప్రభం ।**

**భక్త మానసగేహం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 39**

**అర్థము** :- రత్నాంగుళీయవిలసత్ = రత్నములు పొదిగిన ఉంగరములతో ప్రకాశించుచున్న; కరశాఖా నఖ ప్రభం = చేతివ్రేళ్ల గోళ్ల యొక్క కాంతి

గలవానిని; భక్తమానస గేహం = భక్తుల మనస్సులే నివాస స్థలమైన వానిని........... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీ చేతివ్రేళ్లు రత్నమయములైన ఉంగరములతో అలంకరింపబడి యున్నవి. అందువలన వ్రేళ్ల గోళ్లు మిక్కిలి కాంతి మంతములై ప్రకాశించు చున్నవి. నీవు కైలాసము నందుందువని, రజత గిరియందుందు వని, హిమాద్రి యందుందువని భక్తులు భిన్న భిన్న రీతులలో వర్ణించిరి. నిన్ను నేను భక్తమనోవాసిగా దర్శించుచున్నాను. నీకు భక్తి పూర్వకముగా ఒక మారేడాకును సమర్పించి నిన్ను సమర్చించు చున్నాను.

**శ్లో॥ వామాంగ భాగ విలస దంబికా వీక్షణ ప్రియం ।**
**పుండరీక నిభాక్షం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 40**

**అర్థము :-** వామాంగభాగ విలసత్ = శరీరము యొక్క యెడమ భాగమునందు విలసిల్లు చున్న; అంబికా వీక్షణ ప్రియం = గౌరీదేవి చూపు లందు మక్కువ కలవానిని; పుండరీక నిభ + అక్షం = పద్మములవంటి కన్నులు గలవానిని....॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీ వామభాగమునందు గౌరీదేవి విలసిల్లు చున్నది. ఆమె చూపులయందు నీవు మిక్కిలి ప్రేమను చూపు చున్నావు. నీ కన్నులు పద్మములవలె సుందరములై యున్నవి. ఇట్టి నిన్ను మనోలోచనముతో దర్శించుచు బిల్వ పత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ సంపూర్ణకామదం సౌఖ్యం భక్తేష్టఫలకారణం ।**
**సౌభాగ్యదం హితకరం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 41**

**అర్థము** :- శివ = ఓ శివా! సంపూర్ణ కామదం సౌఖ్యం = సౌఖ్యమును కలిగించునట్లుగా సర్వవాంఛలను సంపూర్ణముగా నెరవేర్చు వానిని; భక్త + ఇష్టఫలకారణం = భక్తులకు అభీష్టమైన ఫలమును అందించుటకు ఆధారమైన వానిని; సౌభాగ్యదం = సౌభాగ్యము నొసగువానిని; హితకరం = మేలు చేయు వానిని.......॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు సౌఖ్యకరములయిన సర్వకాంక్షితములను తీర్చు చున్నావు. భక్తులు కోరిన ఫలములను తీర్చెడివాడవు నీవు. సౌభాగ్యమును కలిగించువాడవు నీవు. మేలును కలిగించువాడవు నీవు. ఇట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వ పత్రమును పూజాపత్రముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ నానా శాస్త్ర గుణోపేతం స్ఫురన్మంగళ విగ్రహం ।**
**విద్యా విభేద రహితం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 42**

**అర్థము** :- నానా శాస్త్ర = వివిధ శాస్త్రములందు చెప్పబడిన; గుణ + ఉపేతం = గుణములతో కూడియున్న వానిని; స్ఫురత్ = ప్రకాశ మానమయిన; మంగళ విగ్రహం = కల్యాణ కరమయిన రూపము గలవానిని; విద్యా విభేద రహితం = విద్య అవిద్య అనెడి భేదములు లేని వానిని ........ ॥

**తాత్పర్యము** :-శివా! నీవు శాస్త్రములలో నిబంధింపబడిన సర్వసుగుణము లను కలవాడవు. నీవు చక్కగా ప్రకాశించుచున్న మంగళ కరమైన ఆకారము గలవాడవు. విద్య అవిద్యయనెడి భేద ములు లేనివాడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు నీకు బిల్వపత్రముతో పూజ చేయుచున్నాను.

**శ్లో॥ అప్రమేయ గుణాధారం వేదకృద్రూపవిగ్రహం ।**

**ధర్మాధర్మ ప్రవృత్తిం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 43**

**అర్థము :-** అప్రమేయ = కొలుచుటకు వీలుకాని; గుణ + ఆధారం = గుణములకు ఆశ్రయమైన వానిని; వేదకృత్ = వేదముల చేత నిరూపింప బడిన; రూప = ఆకారముగల; విగ్రహం = మూర్తిని గలవానిని; ధర్మ + అధర్మ ప్రవృత్తిం = ధర్మ ప్రవృత్తి అని అధర్మప్రవృత్తి అని ప్రవర్తనమును రెండుగా విభజించిన వానిని; ....॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు నిర్గుణుడ వైనప్పటికి అప్రమేయములయిన గుణములకు ఆధారమైనవాడవు. వేదము నందు నిరూపింపబడిన రూపమే నీ రూపము. ధర్మమని అధర్మ మని ప్రవృత్తి రెండు విధములుకాగా ఆరెండింటికి ఆశ్రయ మైన వాడవు నీవే. ఇట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వ పత్రముతో సేవించు చున్నాను.

**శ్లో॥ గౌరీ విలాసవదనం జీవ జీవ పితామహం ।**

**కల్పాంత భైరవం శుభ్రం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 44**

**అర్థము :-** గౌరీ విలాసవదనం = పార్వతీ దేవి యొక్క తేజోమయ మైన ముఖమును గలవానిని; జీవ జీవ పితామహం = జీవులకు ప్రాణమైన పితా మహుడైన వానిని; కల్పాంత భైరవం = ప్రళయకాలమునందు భయంకరు డగువానిని; శుభ్రం = నిర్మలుడైన వానిని.............॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు పార్వతీదేవి ముఖమును విలసిల్లునట్లుగా చేయుచున్నావు. నీవు జీవులకు జీవభూతుడవు. అందు వల్లనే సర్వజీవులకు

ఆదిపురుషుడవై పితామహుడవగు చున్నావు. నీవు ప్రళయాధిపతివి. నీవు ప్రళయ కాలమును కల్పింతువు. అట్టి సమయమున నీవు భయంకరుడవై ఉగ్రుడవై యుందువు. అయినను నీవు స్వచ్ఛస్వరూపుడవు. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వ పత్రముతో పూజించు చున్నాను.

**శ్లో॥ సుఖదం సుఖనాశం చ దు:ఖదం దు:ఖనాశనం ।**

**దు:ఖావతారం భద్రం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 45**

**అర్థము** :- సుఖదం = సుఖములను కలిగించువానిని; సుఖనాశనం = సుఖములను నాశనము చేయువానిని; దు:ఖదం = దు:ఖములను కలిగించు వానిని; దు:ఖనాశనం = దు:ఖము లను నాశనము చేయువానిని; దు:ఖ + అవతారం = దు:ఖ రూపముగా అవతరించు వానిని; భద్రం = శ్రేయమును రూపముగా ధరించిన వానిని....... ॥

**తాత్పర్యము** :- ఓ శివా! సుఖదు:ఖములు నీ అధీనములు. సుఖములు కలుగుటకు నీవే కారణము; దు:ఖములు కలుగుటకును నీవే కారణము. అట్లే సుఖములు కలుగుటకు నీవే కారణము; సుఖనాశనమునకు సైతము నీవే కారణము. నీవు దు:ఖరూపముగా అవతరింతువు; అట్లే శ్రేయో రూపముగాను అవతరింతువు. సుఖదు:ఖములనెడి ద్వంద్వ ములను కలిగించుటకు తొలగించుటకు నీవే సమర్థుడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వ పత్రముతో అర్చింతును.

**శ్లో॥ సుఖరూపం రూపనాశం సర్వధర్మ ఫలప్రదం ।**

**అతీంద్రియం మహామాయం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 46**

**అర్థము :-** సుఖరూపం = సుఖమునకు ఆకారమైనవానిని; రూపనాశం = రూపరహితత్వము కలిగించు వానిని; సర్వధర్మఫలప్రదం = అన్ని ధర్మములకు నిర్దేశింపబడిన ఫలితములను ప్రసా దించు వానిని; అతి + ఇంద్రియం = ఇంద్రియములకు అతీతమైన వానిని; మహామాయం = గొప్ప మాయను కలవానిని... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు సుఖ రూపుడవు. శివనామధేయము చేతనే యీ విషయము వెల్లడియగు చున్నది. అట్లయ్యును నీవు రూపరహితుడవు. అందు వల్లనే నీ భక్తులకు సైతము శారీరక వ్యామోహమును నశింపజేసెదవు. వేర్వేరు ధర్మము లకు వేర్వేరు ఫలము లుండును. ఫలదాతలు కూడ వేర్వేరుగా నుందురు. ఇది సాధారణ విషయము. నీ విష యము వేరు. నీవు సర్వేశ్వరు డవగుట చేత సర్వధర్మముల యొక్క ఫలితములను నీవే ప్రసాదింతువు. నీవు ఇంద్రియ ములకు అతీతుడవు. (యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ) వాక్కులు గాని మనస్సుగాని నిన్ను చేర జాలవు. నీవు మాయాధరుడవు. అందువల్లనే నిన్ను ప్రత్యక్ష ముగా చూచుచున్నట్లే అనిపింతువు గాని అగోచరుడవై యుందువు. తదంతికే తద్దూరే అన్నది నిన్ను గురించియే. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వార్చనము చేయు చున్నాను.

**శ్లో॥ సర్వపక్షిమృగాకారం సర్వపక్షిమృగాధిపం ।**
**సర్వపక్షిమృగాధారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 47**

**అర్థము :-** సర్వపక్షి + మృగ + ఆకారం = సర్వపక్షులయొక్కయు జంతువుల యొక్కయు ఆకారము గలవానిని; సర్వపక్షి మృగాధిపం =

సర్వపక్షులకు జంతువులకు అధిపతియైన వానిని; సర్వపక్షిమృగాధారం = సర్వపక్షులకు మృగములకు ఆధారమైన వానిని...... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! కనులకు గోచరించు సృష్టి యంతయు నీ రూపము. సృష్టియందలి జంగమస్థావరము లన్నియు నీరూపమే. పశువులేమి, పక్షులేమి అన్నియు నీ రూపమే. ఈ రూపము నీదే యగుటచేత నీవే దీనికి అధిపతివి. నీదైన యీ సృష్టికి ఆధారభూతుడవై నిలబెట్టువాడవు నీవే. (ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై ఎవ్వని యందు డిందు పరమేశ్వరుడెవ్వడు ...) అట్టి నిన్ను ధ్యానించుచు బిల్వపత్రార్పణముతో అర్చింతును.

**శ్లో॥ జీవాధ్యక్షం జీవవంద్యం జీవ జీవన రక్షకం ।**

**జీవకృజ్జీవ హరణం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 48**

**అర్థము :-** జీవ + అధ్యక్షం = ప్రాణులకు అధిపతియైన వానిని; జీవవంద్యం = ప్రాణులకు వందనీయుడైన వానిని; జీవ జీవన రక్షకం = జీవుల యొక్క ప్రాణములకు రక్షణ కలిగించు వానిని; జీవకృత్ + జీవహరణం = ప్రాణులను ఖండించువారి ప్రాణములను తీయువానిని; ..........॥

**తాత్పర్యము :-** ఓ శివా! సర్వజీవులకు అధిపతివి నీవు. సర్వజీవులకు వందనీయుడవు నీవు. జీవులయొక్క ప్రాణములను రక్షించువాడవు నీవు. జీవులకు హాని కలిగించు వారి ప్రాణములను నశింపజేయువాడవు నీవు. అట్టి నిన్ను స్మరించుచు నీకు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ విశ్వాత్మానం విశ్వవంద్యం వజ్రాత్మం వజ్రహస్తకం ।**

**వజ్రేశం వజ్ర భూషం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 49**

**అర్థము :-** విశ్వ + ఆత్మానం = విశ్వమునకు ఆత్మయైనవానిని; విశ్వ వంద్యం = విశ్వముచేత నమస్కరింపబడు వానిని; వజ్రాత్మం = వజ్రము వలె దృఢమైన ఆత్మగలవానిని; వజ్రహస్తకం = వజ్రములను హస్తములందు గలవానిని; వజ్రేశం = వజ్రములకు అధిపతియైన వానిని; వజ్రభూషం = వజ్రమయములయిన అలంకారములను గల వానిని ..................॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు విశ్వమునకు ఆత్మవు. నీవలననే విశ్వము చైతన్యవంతమై యున్నది. సర్వవిశ్వము నీకు నమస్కరించు చున్నది. నీవు వజ్రసన్నిభమైన ఆత్మగలవాడవు; నీ చేతుల యందు వజ్రము లున్నవి. నీవు వజ్రములకు అధిపతివి. నీవు వజ్రమయములయిన నగలను ధరించి యున్నావు. అట్టి ఐశ్వర్యసంపన్నుడవైన నిన్ను సన్నుతించుచు బిల్వ పత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ గణాధిపం గణాధ్యక్షం ప్రళయానల నాశకం ।**
**జితేంద్రియం వీరభద్రం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 50**

**అర్థము :-** గణాధిపం = గణములకు అధిపతియైన వానిని; గణాధ్యక్షం = గణములకు అధ్యక్షుడైన వానిని; ప్రళయానల నాశకం = ప్రళయాగ్ని వలెనాశనము చేయువానిని; జితేంద్రియం = ఇంద్రియములను జయించిన వానిని; వీరభద్రం = వీరులకు భద్రతను కలిగించువానిని (వీరభద్రుడను పేరు గలవానిని) .....॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు దేవగణములకు అధిపతివి. భూతపిశాచాది గణములకు అధ్యక్షుడవు. ప్రళయకాలమునందలి అగ్నివలె సర్వమును నాశనము చేయువాడవు. ఇంద్రియజయమును సాధించిన వాడవు.

వీరభద్రరూపమున విజృంభించిన వాడవు కూడ నీవే. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వ పత్రముతో అర్చించు చున్నాను.

**శ్లో॥ త్ర్యంబకం మృడం శూరం అరిషడ్వర్గనాశనం ।**
**దిగంబరం క్షోభనాశం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 51**

**అర్థము :-** త్రి + అంబక్షం = మూడు కన్నులు గలవానిని; మృడం = భక్తులకు సుఖమును కలిగించు వానిని; శూరం = శౌర్యము గలవానిని; అరిషడ్వర్గ నాశకం = కామక్రోధలోభ మోహ మద మాత్సర్యము లనెడి శత్రువుల నారింటిని నాశనము పొందించు వానిని; దిగంబరం = దిక్కులే వస్త్రముగా గలవానిని; క్షోభనాశం = కలతను నశింప జేయువానిని ......॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు సూర్యచంద్రాగ్నులను మూడు నేత్రములు గలవాడవు. మృడు డన్ననామధేయము గలవాడవు. త్రిపురాసురాదులను సంహరించిన శూరుడవు. శత్రు వర్గమైన కామాదులను నాశనము చేయు వాడవు. నీవు విశ్వవ్యాప్తమైన మూర్తి గలవాడవు కనుక దిక్కులే నీకు వస్త్రములుగా ఉపచరించు చున్నవి. ప్రపంచమునందలి సంక్షోభమును నాశనము పొందించు వాడవు నీవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రమును పూజా పత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ కుందేందుశంఖ ధవళం త్రిభిరక్షిభి రుజ్జ్వలం ।**
**కాలాగ్నిరుద్రం సర్వజ్ఞం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 52**

**అర్థము :-** కుంద + ఇందు + శంఖ ధవళం = మొల్లవలె, చంద్రుని వలె, శంఖమువలె తెల్లని వర్ణముగల వానిని; త్రిభి: + అక్షిభి: + ఉజ్జ్వలం =

మూడు కన్నులచేతను ప్రకాశించు చున్నవానిని; కాలాగ్ని రుద్రం = ప్రళయకాలమునందలి అగ్నివలె భయంకరమైన వానిని; సర్వజ్ఞం = సర్వమును ఎరిగిన వానిని ...... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు ధవళవర్ణము గలవాడవు. నీ శరీరము మొల్లవలె చంద్రునివలె శంఖమువలె తెల్లని వన్నె కలిగి శోభించు చున్నది. నీ వదనము త్రినేత్ర పరిశోభితమై ప్రకాశించు చున్నది. నీవు ప్రళయాగ్నివలె భయమును గొల్పుచున్నావు. నీవు భూత భవిష్యద్వర్తమానములను తెలిసిన వాడవు; అట్లే అందరి యింగితములను చేష్టితము లను తెలిసిన వాడవు. అట్టి నిన్ను సన్నుతించుచు పూజా పత్రముగా నీకు ప్రియమైన బిల్వ పత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ కంబుగ్రీవం కంబుకంఠం ధైర్యదం ధైర్యవర్ధకం ।**
**శార్దూల చర్మవసనం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 53**

**అర్థము :-** కంబుగ్రీవం = శంఖమువంటి మెడగలవానిని; (మూడు ముడుతలు గల మెడగలవానిని); కంబుకంఠం = శంఖ ధ్వని వంటి ధ్వని గల కంఠము గలవానిని; ధైర్యదం = ధైర్యమును గల్పించువానిని; ధైర్యవర్ధకం = ధీరత్వమును వృద్ధి పొందించువానిని; శార్దూల చర్మవసనం = పులి చర్మమును వస్త్రముగా ధరించువానిని .............॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీ మెడ మూడు ముడుతలు గలిగి శంఖముతో సామ్యమును గలిగియున్నది. నీ కంఠధ్వని శంఖధ్వనిని పురుడించు చున్నది. నీవు నీ భక్తులకు ధైర్యమును ప్రసాదింతువు. ధైర్యమును వృద్ధిపొందింతువు.

నీవు శార్దూల చర్మమును వస్త్రముగా ధరింతువు. అట్టి నిన్ను సన్ను తించుచు ఒక బిల్వపత్రమును పూజాపత్రముగా సమ ర్పించి అర్చించుచున్నాను.

**శ్లో॥ జగదుత్పత్తిహేతుం చ జగత్ప్రళయ కారణం ।**

**పూర్ణానందస్వరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥**

**అర్థము :-** జగత్ + ఉత్పత్తిహేతుం = ప్రపంచముయొక్క పుట్టుకకు కారణమైనవానిని; జగత్ ప్రళయ కారణం = ప్రపంచము యొక్క నాశనమునకు కారణమైన వానిని; పూర్ణానంద స్వరూపం = పరిపూర్ణమైన ఆనందమే స్వరూపముగా నున్న వానిని...........॥

**తాత్పర్యము :-** ఓ శివా! సర్వజగత్తు నీ వల్లనే జనించు చున్నది. అట్లే జగత్తు సర్వము నీ వల్లనే లయము నొందుచున్నది. మూర్తి దాల్చిన పూర్ణానందమే నీవు. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వపత్రముతో పూజించు చున్నాను.

**శ్లో॥ సర్గకేశం మహత్తేజం పుణ్యశ్రవణ కీర్తనం ।**

**బ్రహ్మాండనాయకం తారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 55**

**అర్థము :-** సర్గకేశం = సృష్టి చేయగల వెంట్రుకలు గల వానిని; మహత్తేజం = గొప్పకాంతిని గలవానిని; పుణ్య శ్రవణ కీర్తనం = పుణ్య విషయములను వినుట కీర్తించుట కలవానిని; బ్రహ్మాండ నాయకం = సర్వ విశ్వమునకు అధిపతియై నడిపించు వానిని ... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! దక్షాధ్వరధ్వంసమునకై నీవు నీ శిరోజమును పెరికి వీరభద్రుని సృజించితివి. నీవు గొప్ప కాంతిని పరాక్రమ మును

గలవాడవు. నీవు నీ భక్తుల పుణ్యగాథలను విందువు. అట్లే ఆయా పుణ్య గాథలను కీర్తింతువు. సర్వ విశ్వమునకు అధినాయకుడవు. సర్వవిశ్వమును నడిపించు వాడవు నీవే. అట్టి నిన్ను స్తుతించి బిల్వ పత్రమును పూజా పత్రముగా సమర్పించి అర్చించు చున్నాను.

**శ్లో॥ మందారమూల నిలయం మందార కుసుమప్రియం ।**
**బృందారక ప్రియతరం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 56**

**అర్థము :-** మందారవృక్షమూలమే నెలవుగా గలవానిని; మందార కుసుమ ప్రియం = మందారపుష్పములందు ప్రీతి గల వానిని; బృందారక ప్రియతరం = దేవతలకు మిక్కిలి యిష్టుడైన వానిని .............॥

**తాత్పర్యము :-** ఓ శివా! మందార వృక్షమూలమే నీ నివాస స్థానము. మందారపుష్పములన్న నీకు మిక్కిలి యిష్టము. దేవతలకు నీవు మిక్కిలి యిష్టుడవు. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రముతో నీకు పూజ చేయు చున్నాను.

**శ్లో॥ మహేంద్రియం మహాబాహుం విశ్వాస పరిపూరకం ।**
**సులభాసులభం లభ్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 57**

**అర్థము :-** మహా + ఇంద్రియం = గొప్పయింద్రియములను కలిగిన వానిని; మహాబాహుం = గొప్ప బాహువులను కలిగిన వానిని; విశ్వాస పరిపూరకం = నమ్మకమును నింపు వానిని; సులభ + అసులభం = తేలికగా లభించు వాడయ్యును కష్టముగా లభించు వానిని; లభ్యం = లభించెడి వానిని .............॥

**తాత్పర్యము** :-ఓ శివా! నీకు పంచ భూతములు, సూర్యచంద్రులు, యాజ్ఞికుడు అను ఎనిమిది అవయవములు గలవు. ఆ విధముగా నీవు అష్టమూర్తిగా మహేంద్రియునిగా కీర్తి నొందితివి. నీవు సుదీర్ఘబాహువులు కలవాడవు. మనుజు లందు భగవద్విశ్వాసమును నింపువాడవు నీవే. నీవు సులభముగానే లభింతువు. అందువల్లనే నీకు ఆశుతోషు డని, ఉబ్బులింగడని వ్యవహారము గలదు. అట్లే అయినను నీవు కష్టముమీద గాని లభింపవు. ఎట్లయినను నీవు తప్పక పొందదగిన వాడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్ర సమర్పణముతో సమర్చించు చున్నాను.

**శ్లో॥ బీజాధారం బీజరూపం నిర్బీజం బీజవృద్ధిదం ।**
**పరేశం బీజనాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 58**

**అర్థము** :- బీజ + ఆధారం = సృష్టిబీజమునకు ఆధారమైన వానిని; బీజరూపం = బీజము యొక్క రూపమే తన రూపమైన వానిని; నిర్ + బీజం = తనకంటె ఇతర బీజములు లేని వానిని; బీజవృద్ధిదం = బీజములకు వృద్ధిని కలిగించు వానిని; పరేశం = ఉన్నతోన్నతప్రభువును; బీజనాశం = విత్తనములను నశింపజేయువానిని ......॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు భవుడవు. సృష్టికి మూలమైన బీజమునకు ఆధారము నీవే. నీవు నీ సృష్టి యొక్క ఆకారము కల వాడవు. అందువల్లనే నిన్ను విశ్వరూపునిగా గానము చేయుచున్నారు. నీవు నిర్బీజుడవు. నీవు తప్ప మరియే విత్తనములును విశ్వసృష్టికి లేనివాడవు. నీ వొక్కడవే అయినను విత్తనములకు వృద్ధిని కలిగించి జగద్వ్యాప్తికి తోడ్పడువాడవు నీవే. నీవే పరాత్పరుడవు. లయకారుడవు కూడ నీవే. అట్టి నిన్ను సన్నుతించుచు

బిల్వపత్రము నొక దానిని పూజా పత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ యుగాకారం యుగాధీశం యుగకృద్ యుగనాశకం ।**

**పరేశం బీజనాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 59**

**అర్థము** :- యుగ + ఆకారం = కాలస్వరూపుడైన వానిని; యుగ + అధీశం = కాలమునకు అధిపతియైన వానిని; యుగకృత్ = యుగములను నిర్మించువానిని; యుగనాశకం = యుగములను నశింపజేయువానిని (ఉత్తరార్ధము పునరుక్తము)...... ॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు కాలస్వరూపుడవు. కాలమునకు అధిపతివి సైతము నీవే. కాలమును విభజించి యుగములుగా నియమించు వాడవు నీవే. యుగములను నాశనము చేయువాడవు కూడ నీవే. మొత్తము మీద కర్తవు, హర్తవు, భర్తవు నీవే. అట్టి సర్వప్రభుడవైన నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రముతో సమర్పించుచున్నాను.

**శ్లో॥ ధూర్జటిం పింగళజటం జటా మండల మండితం ।**

**కర్పూరగౌరం గౌరీశం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 60**

**అర్థము** :- ధూర్ + జటిం = భారభూతములైన జడలు గలవానిని; పింగళజటం = గోరోచన వర్ణముగల జడలు గలవానిని; జటామండల మండితం = జడల సమూహముచేత అలంక రింపబడినవానిని; కర్పూర గౌరం = కర్పూరమువలె ధవళవర్ణముగల వానిని; గౌరీ + ఈశం = పార్వతీ వల్లభుని ........॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు బరువైన జడలను గలవాడవు. నీ జడలు ఎఱ్ఱని రంగు గలవి; ఆ జడల సమూహము నీ శిరమునకు అలంకారమై అలరించు చున్నది. నీవు కర్పూర సన్నిభమైన తెల్లని వన్నెగలవాడవు. ఓ పార్వతీప్రాణనాయకా! నిన్ను సన్నుతించుచు నీకు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ సురావాసం జనావాసం యోగీశం యోగి పుంగవం।**

**యోగదం యోగినాం సింహం ఏకబిల్వం శివార్పణమ్॥ 61**

**అర్థము :-** సుర + ఆవాసం = దేవతలను నెలవుగా కలవానిని (దేవతలకు నెలవైన వానిని); జన + ఆవాసం = ప్రజలను నెలవుగా కలవానిని (ప్రజలకు నెలవైన వానిని) యోగి + ఈశం = యోగులకు ప్రభువైన వానిని; యోగిపుంగవం = యోగులలో శ్రేష్ఠుని; యోగదం = యోగమును ప్రసాదించు వానిని; యోగినాం సింహం = యోగులకు సింహము వంటి వానిని .........॥

**తాత్పర్యము :-** ఓ శివా! దేవతలును ప్రజలును నిన్నే తమ ఆవాస స్థానముగా చేసికొని యున్నారు. అట్లే దేవతలను ప్రజలను నీవు నీ నివాస స్థానముగా చేసికొని యున్నావు. నీవు సర్వయోగులను మించిన వాడవగుటచేత భక్తులు నిన్ను యోగీశ్వరునిగా, యోగిపుంగవునిగా, యోగిసింహముగా సంబోధించు చున్నారు. యోగవిద్యను అనుగ్రహించు వాడవు కూడ నీవే. అట్టి నిన్ను బిల్వపత్రసమర్పణముతో సేవించు చున్నాను.

**శ్లో॥ ఉత్తమానుత్తమం తత్త్వం అంధకాసుర సూదనం।**

**భక్తకల్పద్రుమ స్తోమం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 62**

**అర్థము** :- ఉత్తమ + అనుత్తమం = ఉత్తముడును అనుత్తముడునైన వానిని (అనుత్తము డనగా ఉత్తమోత్తముడని యర్థము); తత్ + త్వం = తత్ శబ్దము యొక్క స్వభావమైన వానిని; అంధకాసుర సూదనం = అంధకుడనెడి రాక్షసుని సంహ రించిన వానిని; భక్త కల్పద్రుమ స్తోమం = భక్తులకు కల్పద్రుమ సమూహముగా అయినవాడవు ..........॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు శ్రేష్ఠుడవు. అంతేకాదు. నీ కంటె శ్రేష్ఠులైనవారు ఎవరును లేరు. అందువల్లనే నిన్ను ఉత్తమునిగా అనుత్తమునిగా భక్తులు సంభావించు చున్నారు. 'ఓం తత్ సత్' అన్న మంత్రము నందలి తత్ శబ్దము యొక్క అర్థమే నీవు. అంధకుడనెడి రాక్షసుని సంహరించినవాడవు నీవు. భక్తుల పాలిటికి కల్పవృక్షముల సమూహమవై కోరిన కోరికల నన్నింటిని తీర్చువాడవు నీవు. అట్టి నిన్ను స్తుతించుచు మారేడు పత్రమును పూజా పత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ విచిత్రమాల్య వసనం దివ్య చందన చర్చితః ।**
**విష్ణు బ్రహ్మాది వంద్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 63**

**అర్థము** :- విచిత్ర + మాల్య + వసనం = చిత్రచిత్రములైన హారము లను వస్త్రములను ధరించిన వానిని; దివ్య చందన చర్చితం = దేవతా సంబంధమైన గంధముతో అలంకరింపబడిన వానిని; విష్ణు బ్రహ్మాదివంద్యం = విష్ణువు బ్రహ్మ మొద లయిన వారిచేత పూజింపబడు వానిని ........॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు చిత్రచిత్రములైన హారములను ధరింతువు. ఒకప్పుడు నాగరాజు నీ కంఠహారమై యుండును. ఒకప్పుడు కపాలమాల నీ

గళమునలంకరించి శబ్దించు చుండును. ఒకప్పుడు మందారమాలలతో నీ కంఠము సొగసు లీను చుండును. అట్లే నీవు ధరించు వస్త్రములు కూడ ఆశ్చర్య జనకములై యుండును. ఒకప్పుడు రక్తబిందువుల నోడు చున్న గజచర్మమును ధరింతువు. ఒకప్పుడు దుకూలధారివై యుందువు. ఒకప్పుడు దిక్కులే వస్త్రము కాగా దిగంబరు డవై యుందువు. ఇంకను నీవు ధరించు హారములు, వస్త్రములు ఎన్నోవిధములుగా నుండవచ్చును. నీ శరీరము భస్మలేపనమును పొంది యుండుట ప్రసిద్ధమే. కాని దివ్యమైన చందనము కూడ నీ శరీరమునకు పూతయై సువాసనలను గుబాళించు చుండును. విష్ణువు బ్రహ్మ మొదలయిన లోకవంద్యులు కూడ నీకు వందనములు సల్పుచున్నారు. అట్టి నిన్ను ధ్యానించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ కుమార పితరం దేవం సితచంద్రకళాధరం ।**

**బ్రహ్మ శత్రుం జగన్మిత్రం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 64**

**అర్థము :-** కుమారపితరం = కుమారస్వామి యొక్క తండ్రిని; దేవం = భగవంతుని; సితచంద్ర కళాధరం = తెల్లని చంద్రరేఖను ధరించిన వానిని; బ్రహ్మశత్రుం = బ్రహ్మకు శత్రువైన వానిని; జగత్ + మిత్రం = లోకమునకు స్నేహితుడైన వానిని.......... ॥

**తాత్పర్యము :-** ఓ శివా! దేవతలకు సేనాధిపతియై తారకాసుర సంహార కుడైన కుమారస్వామిని కన్నతండ్రివి నీవు. నీవు దేవ దేవుడవు. తెల్లని చంద్రకళను నీవు నీ జటాజూటమునందు ధరించి యున్నావు. బ్రహ్మకు అయిదు శిరస్సు లుండగా ఆయన చేసిన అపరాధమునకు పరిహారముగా

శత్రు డవైనట్లు అతని శిరస్సు నొకదానిని ఖండించి వేసితివి. అప్పటినుండియు బ్రహ్మ చతుర్ముఖుడయ్యెను. నీవు సర్వలోకములకు మిత్రుడవు. సముద్ర మథనకాలమున అతిభయంకరమైన హాలాహల విషము జనింపగా దానిని మ్రింగి సదసద్వర్గములయిన దేవ రాక్షస జాతులనేకాక సర్వలోకములను కాపాడి సర్వలోకములకు మిత్రుడవైతివి. అట్టి నీకు బిల్వ పత్రమును సమర్పించి అర్చించు చున్నాను.

**శ్లో॥ లావణ్యమధురాకారం కరుణారసవారిధిం ।**
**భ్రువోర్ మధ్యేసహస్రార్చిం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 65**

**అర్థము :-** లావణ్య మధుర + ఆకారం = స్నిగ్ధత గల మధుర మయిన రూపముగల వానిని; కరుణారసవారిధిం = దయా రసమునకు సముద్రమైన వానిని; భ్రువో: + మధ్యే సహస్రార్చిం = రెండు కనురెప్పల మధ్య అగ్నిని కలవానిని; ...॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు సుస్నిగ్ధమైన మధురాతి మధురమైన రూపముగలవాడవు. దయారసమునకు నీవు అపారమైన సముద్రమువంటి వాడవు. నీ కనురెప్పల మధ్యదేశము నందు, అనగా లలాటము నందు అగ్నినేత్రము కలవాడవు. అట్టి నిన్ను సన్నుతించుచు పూజాపత్రముగా బిల్వ పత్రమును నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ జటాధరం పావకాక్షం ఋక్షేశం భూమినాయకం ।**
**కామదం సర్వదా గమ్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 66**

**అర్థము :-** జటాధరం = జడలు ధరించినవానిని; పావక + అక్షం = అగ్నియేనేత్రముగా కలవానిని; ఋక్ష + ఈశం = నక్షత్రాధిపతిని కలవానిని; భూమి నాయకం = సమస్త భూమికి నాయకుని; కామదం = కోరికలను తీర్చెడివానిని; సర్వదా గమ్యం = ఏ సమయమందైనను చేరదగినవానిని .........॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు జటాజూటమును ధరించువాడవు. నొసట అగ్నినేత్రమును ధరించిన వాడవు. జటాజూటములో తారాధీశుడైన చంద్రుని ధరించి యున్నావు. సర్వ విశ్వమునకు నాయకుడవు నీవు. నీవే సర్వవిశ్వమును నడిపించు చున్న వాడవు. భక్తుల కోరికలను ప్రసాదించు వాడవు నీవు. ఎల్లప్పుడును చేరుటకు వీలయినవాడవు నీవు. సర్వసులభుడవు. సర్వదా సులభుడవు. అట్టి నిన్ను సంభావించుచు బిల్వపత్రసమర్పణముతో సమర్చించు చున్నాను.

**శ్లో॥ శివం శాంత ముమానాథం మహాధ్యాన పరాయణం ।**
**జ్ఞానప్రదం కృత్తివాసం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 67**

**అర్థము :-** శివం = శుభమును ప్రసాదించువానిని; శాంతం = శాంతిని ప్రసాదించు వానిని; ఉమానాథం = పార్వతీపతిని; మహా ధ్యాన పరాయణం = మహాధ్యాన మందు నిమగ్నుడై యున్నవానిని; జ్ఞానప్రదం = జ్ఞానమును ప్రసాదించు వానిని; కృత్తివాసం = చర్మమును వస్త్రముగా ధరించిన వానిని ......॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు శివమూర్తివి; శాంతమూర్తివి. జ్ఞానమూర్తివి. అందువల్ల నిన్ను ఆశ్రయించిన భక్తులకు శుభములను ప్రసాదింతువు. శాంతిని

ప్రసాదింతువు. జ్ఞానమును ప్రసాదింతువు. నీవు పార్వతీపతివి. మహా ధ్యానమునందు పరాకాష్ఠ నందుకొన్నవాడవు. చర్మమునే వస్త్రముగా ధరించిన వాడవు నీవు. అట్టి నిన్ను సన్నుతించుచు మారేడాకుతో నీకు పూజ చేయుచున్నాను.

శ్లో॥ వాసుక్యురగహారం చ లోకానుగ్రహ కారణం ।

జ్ఞానప్రదం కృత్తివాసం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 68

**అర్థము** :- వాసుకి + ఉరగహారం = వాసుకి అనెడి సర్పమును కంఠ హారముగా ధరించిన వానిని; చ = మరియు; లోక + అనుగ్రహకారణం = ప్రజలయెడల కరుణ చూపుటకు ఆశ్రయమైనవానిని (ఉత్తరార్ధము పునరుక్తము)........॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీ మెడయందు వాసుకి అనెడి సర్పరాజు హారాలంకారమై యున్నాడు. అనుగ్రహమనెడి కార్యమునకు కారణమైనవాడవు నీవు. నీవలననే లోకము అనుగ్రహ భాగ్యమును పొందుచున్నది. జ్ఞాననిధివి నీవు. కావుననే జీవులకు జ్ఞానము ననుగ్రహింతువు. చర్మమునే వస్త్రముగా ధరించుటచేత నీ నిరాడంబరత్వము అను గ్రహ మహత్త్వము వెల్లడి యగుచున్నవి. అట్టి నిన్ను సన్ను తించుచు మారేడుదళముతో నీకు పూజ చేయు చున్నాను.

శ్లో॥ శశాంకధారిణం భర్గం సర్వలోకైక శంకరం ।

శుద్ధం చ శాశ్వతం నిత్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 69

**అర్థము** :- శశాంక ధారిణం = చంద్రుని ధరించినవానిని; భర్గం =

కామకాలాదులను నాశనము చేసిన వానిని; సర్వలోకైక శంకరం = లోకముల కన్నింటికి శుభమును కలిగించు వానిని; శుద్ధం = నిర్మలుని; చ = మరియు; శాశ్వతం = ఎల్లప్పుడు నుండువానిని; నిత్యం = నియమపూర్వకముగా నుండు వానిని....॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీ శిరస్సున నీవు చంద్రుని ధరించి యున్నావు. కాముడు కాలుడు మొదలయిన వారిని దండించిన వాడవు. ఒకప్పుడు దండించుట చేత ఇప్పటికిని, ఎప్పటికిని దండింపగలవాడవు. సర్వలోకములకు ఏకైక శుభప్రదాతవు నీవే. నీవు స్వచ్ఛమైన వాడవు. సృష్టికి పూర్వము నీవుంటివి; సృష్ట్యనంతరము నీవున్నావు. సృష్టి లయము నొందిన పిమ్మట కూడ నీవుందువు. కావుననే నీవు శాశ్వతుడవు. అంతేకాదు. నీవు నియమపూర్వకముగా నుండుట చేత నిత్యుడవు కూడ. అట్టి నిన్ను సన్నుతి సేసి బిల్వ పత్రముతో సేవించు చున్నాను.

**శ్లో॥ శరణాగతి దీనార్థి పరిత్రాణ పరాయణం ।**
**గంభీరం చ వషట్కారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 70**

**అర్థము** :- శరణ + ఆగతి = శరణు చొచ్చిన వారిని; దీన= దయనీయులను; అర్థి = యాచకులను; పరిత్రాణ = రక్షించుట యందు; పరాయణం = పరమాసక్తిని గలిగిన వానిని; గంభీరం = లోతుగల్గిన వానిని; చ = మరియు; వషట్కారం = హవ్యములకు కర్తయైనవానిని; ..... ॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు నీ శరణు చొచ్చిన వారికి ఆశ్రయము నిచ్చెదవు. ఆర్తులు అర్థులు అయిన వారి బాధలను తీర్చి రక్షించెదవు. నీవు చాల లోతయిన వాడవు. యజ్ఞపతివి కూడ నీవేయగుట చేత వషట్

పూర్వకముగా హవ్యములను సమర్పింతువు; నీవే స్వీకరింతువు, అట్టి నీకు బిల్వ పత్రముతో అర్చన చేయుచున్నాను.

**శ్లో॥ భోక్తారం భోజనం భోజ్యం జేతారం జితమానసం ।**
**కరణం కారణం జిష్ణుం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 71**

**అర్థము :-** భోక్తారం = భుజించెడి వానిని; భోజనం = తినుట యనెడి క్రియయైన వానిని; భోజ్యం = తినదగిన పదార్థమైన వానిని; జేతారం = జయించిన వానిని; జితమానసం = జయింప బడిన మనస్సుగల వానిని; కరణం = సాధనమైన వానిని; కారణం = పనిచేయుటకు ప్రేరకుడైనవానిని; జిష్ణుం = జయ శీలము గల వానిని ....॥

**తాత్పర్యము :-** ఓ శివా! భోజనము నీవే. భోక్తవు నీవే. భోజన క్రియవు నీవే. ఈ మూడును నీవే. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అను మూడును నీవే. నీవు నీ మనస్సును జయించితివి. కావుననే జేతవైతివి. నీ ఆచరణచేత నీ భక్తులకు సైతము నీవు దీనినే బోధించు చున్నావు. చేయించు కారణము నీవే. చేయుట కుపయోగపడు పరికరము కూడ నీవే. అప జయమను మాటయే యెరుగని జయ శీలము గల వాడవు నీవు. అట్టి నిన్ను సన్నుతి సేయుచు బిల్వ పత్రమును పూజాపత్రముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ క్షేత్రజ్ఞం క్షేత్రపాలం చ పరార్థైక ప్రయోజనం ।**
**వ్యోమకేశం భీమవేషం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 72**

**అర్థము :-** క్షేత్రజ్ఞం = శరీరమునందుండి ఎరుకగల వానిని; క్షేత్రపాలం = శరీరమును రక్షించుచు నడిపించుచు నుండు వానిని; పరార్థ + ఏక

ప్రయోజనం = ఇతరులకు మేలు చేయుట యొక్కటియే ప్రయోజనముగా కలవానిని; వ్యోమకేశం = ఆకాశమే శిరోజ రాశిగా కలవానిని; భీమవేషం = భయంకరమైన వేషము గలవానిని. ........॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు క్షేత్రజ్ఞుడవు; క్షేత్రపాలకుడవు. జీవులలో అంతర్యామిగా ఉండి సర్వమును గ్రహించువాడవు నీవు. అంతేకాదు జీవులను సరియైన కార్యములందు నియో గించి నడిపించువాడవు నీవు. ఇతరులకు మేలు చేయు టయే నీ లక్ష్యము. నీకు ఇతరు లనువారే లేకపోవుటచేత పరమార్థము నందించుటయే పరమలక్ష్యముగా నున్న వాడవు. ఆకాశమే నీ కేశరాశి. అనగా నీవు అంతటి ఔన్నత్యము గలవాడవని సర్వవ్యాపకుడవని అర్థము. భూతపిశాచాదులు నీ అనుచరగణమగుటచేత నీవు కూడ భయంకర వేషధారణము చేయుదువు. ఇట్టి ఔచిత్య పోషణము నీయందు సర్వత్ర కన్పట్టుచున్నది. సాత్త్వి కులయిన భక్తులకు నీవు శివుడవు. భూతాదులకు నీవు భయంకర వేషధారివి. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వ పత్రము సమర్పించి సమర్చించు చున్నాను.

**శ్లో॥ భవఘ్నం తరుణోపేతం క్షోదిష్ఠ యమనాశకం ।**

**హిరణ్యగర్భం హేమాంగం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 73**

**అర్థము :-** భవఘ్నం = జన్మమును నాశనము చేయువానిని; తరుణోపేతం = యౌవనదశను కలిగియున్నవానిని; క్షోదిష్ఠ = మిక్కిలిక్షుద్రుడైన; యమనాశకం = కాలుని నశింపజేసిన వానిని; హిరణ్య గర్భం = బంగారమును గర్భమందు కలవానిని; హేమ + అంగం = బంగారపు అవయవములు గలవానిని ........॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు జన్మ మరణ రూపమైన సంసారమును నశింపజేయుచున్నావు. అట్లు జీవులకు పునర్జన్మము లేకుండ జేసి మోక్షము నిచ్చు చున్నావు. ఎల్లప్పుడును నీవు యౌవన దశను మాత్రమే కలిగియున్నావు. నీవు చెప్పినను వినక మార్కండేయుని ప్రాణములను హరించు టకు వచ్చిన యముడు క్షుద్రుడు కాక యేమగును? పెద్దల మాటను పెడచెవిని పెట్టిన వానిని అట్లే అనవలయును. అందు వలననే ఆ క్షుద్రుని నశింపజేసి భక్తుని రక్షించితివి. నీ గర్భమునందు బంగారము కలదు. నీ అవయవములు కూడ స్వర్ణమయములే. అట్టి నిన్ను సన్నుతించుచు పూజాపత్రముగా బిల్వ పత్రమును సమర్పించి సమర్పించు చున్నాను.

**శ్లో॥ దక్షం చాముండ జనకం మోక్షదం మోక్షనాయకం ।**
**హిరణ్యదం హేమరూపం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 74**

**అర్థము :-** దక్షం = సమర్థుడైన వానిని; చాముండ జనకం = చాముండు డను రాక్షసుని పుట్టించిన వానిని; మోక్షదం = మోక్షము నిచ్చువానిని; మోక్ష నాయకం = మోక్షమునకు నడిపించు వానిని; హిరణ్యదం = బంగారము నొసంగు వానిని; హేమరూపం = బంగారు స్వరూపము గల వానిని .......॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు సమర్థుడవు. చాముండుడను పేరుగల రాక్షసుని పుట్టించినవాడవు. మోక్షము నిచ్చువాడవు నీవు. అంతే కాదు. మోక్షమునకు నడిపించువాడవు కూడ నీవే. నీవు హిరణ్య గర్భుడవగుటచేత నీవు నీ భక్తులకు హిరణ్యము ననుగ్రహింతువు. నీవు హేమరూపుడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు నీకు బిల్వ పత్రమును సమ ర్పించు చున్నాను.

శ్లో॥ మహాశ్మశాన నిలయం ప్రచ్ఛన్న స్ఫటిక ప్రభం ।
వేదాశ్వం వేదరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 75

**అర్థము :-** మహాశ్మశాన నిలయం = మహాశ్మశానమందు నివసించు వానిని; ప్రచ్ఛన్న స్ఫటిక ప్రభం = దాగిన స్ఫటిక కాంతి వంటి కాంతి గలవానిని; వేద + అశ్వం = వేదమును వాహనముగా కలవానిని; వేద రూపం = వేదమే తన రూపమైన వానిని ..........॥

**తాత్పర్యము :-** ఓ శివా! మహాశ్మశానమే నీకు ఆవాసస్థానము. అందువల్లనే శ్మశానమునకు రుద్రభూమి యన్న పేరు ప్రసిద్ధమైనది. స్ఫటికము కానరాకపోయినను తత్కాంతి నీ శరీరమందు ప్రతిఫలించు చున్నట్లు గోచరించు చున్నది. నీకు వేదమే వాహనము. నీవు వేదరూపుడవు. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వ పత్రమును నీకు సమర్పించు చున్నాను.

శ్లో॥ స్థిరం ధర్మ ముమానాథం బ్రహ్మణ్యం చాశ్రయం విభుం ।
జగన్నివాసం ప్రథమం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 76

**అర్థము :-** స్థిరం = నిలుకడ గలవానిని; ధర్మం = సమస్తమును ధరించి యున్నవానిని; ఉమానాథం = పార్వతీపతిని; బ్రహ్మణ్యం = రక్షణ చేకూర్చువానిని; చ = మరియు; ఆశ్రయం = ఆధారమైనవానిని; విభుం = ప్రభువయిన వానిని; జగన్నివాసం = జగత్తునకు నివాసమైన వానిని (జగత్తు నందు నివసించు వానిని); ప్రథమం = మొట్ట మొదటి వానిని .......॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు నిశ్చలత్వము గలవాడవు. అందువల్లనే స్థిరుడవని స్థాణుడ వని ప్రసిద్ధి నొంది యున్నావు. నీ చేతనే యీ సృష్టి

యంతయు ధరింపబడుచున్నది. ఈ విధముగా నీవు ధర్మరూపుడవై యున్నావు. నీవు పార్వతీనాథుడవు. రక్షణ కోరుటకు భక్తులకు ఆశ్రయ మైనవాడవు నీవు. ఆధారభూతుడవు నీవు. నీవే విభుడవు. జగత్తునే నీ నివాస స్థానముగా ఎన్నుకొనినవాడవు. సృష్టికి పూర్వము నుండియు నుండుటచేత నీవే మొట్టమొదటి వాడవు. అట్టి నిన్ను బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించి సమర్చించు చున్నాను.

**శ్లో॥ రుద్రాక్షమాలాభరణం రుద్రాక్ష ప్రియవత్సలం ।**

**రుద్రాక్షభక్త సంస్తోమం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 77**

**అర్థము :-** రుద్రాక్షమాలాధరం = రుద్రాక్షమాలను ధరించిన వానిని; రుద్రాక్షప్రియవత్సలం = రుద్రాక్షలయందు ప్రీతి గలవారి యందు వాత్సల్యము గలవానిని; రుద్రాక్ష భక్త సంస్తోమం = రుద్రాక్ష భక్తుల సమూహమును గల వానిని.........॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు రుద్రాక్షమాలలను ఆభరణములుగా ధరించినవాడవు. రుద్రాక్షప్రియులయిన భక్తులయెడల నీకు వాత్సల్యము మిక్కుటము. రుద్రాక్షమాలాధారులైన భక్తులు సమూహముగా నిన్ను చుట్టుకొని సేవించు చుందురు. నిన్ను అనుసరించి రుద్రాక్షప్రీతిని కలిగి యుండుట నీ భక్తులయిన వారికి యోగ్యప్రవర్తనమే కదా! అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రముతో నీకు పూజ చేయు చున్నాను.

**శ్లో॥ ఫణీంద్ర విలసత్కంఠం భుజంగాభరణ ప్రియం ।**

**దక్షాధ్వర వినాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 78**

**అర్థము** :- ఫణీంద్ర విలసత్ కంఠం = సర్పరాజుచేత ప్రకాశించు నట్టి మెడ కలవానిని; భుజంగాభరణప్రియం = సర్పము లను అలంకారములుగా ధరించుట యందు ప్రీతి గల వానిని; దక్ష + అధ్వర వినాశం = దక్షుని యొక్క యజ్ఞమును నాశనము చేసిన వానిని...........॥

**తాత్పర్యము** :- నాగేంద్రుడైన వాసుకిని కంఠము నందు ధరించితివి. అందువలన నీ కంఠము నాగేంద్రహారము చేత ప్రకాశించు చున్నది. నీకు ఇతరాలంకారము లెన్నయిన నుండవచ్చును. కాని సర్పములను ఆభరణములుగా ధరించుటయందే నీకు ప్రీతియెక్కువ. నీకు అవమానము చేయుటయే లక్ష్యముగా పెట్టుకొని దక్షుడు యజ్ఞము మొదలుపెట్టెను. ఆతడెంత దక్షుడైనను శివదూరమైన యజ్ఞము నెరవేరదు కదా! అందువల్లనే నీవు దక్షయజ్ఞమును నాశనము చేయించితివి. ఓ శివా! అట్టి నిన్ను సన్నుతించుచు పూజాపత్రముగా నీ కొక బిల్వ పత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ నాగేంద్ర విలసత్కర్ణం అహీంద్ర వలయావృతం ।**
**మునివంద్యం మునిశ్రేష్ఠం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 79**

**అర్థము** :- నాగేంద్ర విలసత్ కర్ణం = సర్పరాజులచేత విలసిల్లుచున్న చెవులు గలవానిని; అహీంద్ర వలయావృతం = సర్ప రాజులను కంకణములుగా ధరించిన వానిని; మునివంద్యం = మునులచేత నమస్కరింపబడు వానిని; ముని శ్రేష్ఠం = మునులలో అగ్రగణ్యుడగు వానిని.........॥

**తాత్పర్యము** :- ఓ శివా! సర్పరాజులనే కర్ణభూషణములుగా ధరించి యున్నావు. సర్పరాజులనే నీవు కర కంకణములుగా ధరించి యున్నావు. మునులు నీకు నమస్కరించు చున్నారు. నీవు మునులలో అగ్రగణ్యుడవు

అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రమును నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ మృగేంద్ర చర్మవసనం మునీనామేక జీవనం ।**

**సర్వదేవాదిపుణ్యాం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 80**

**అర్థము :-** మృగేంద్ర చర్మవసనం = సింహ చర్మమును వస్త్రముగా ధరించిన వానిని; మునీనాం + ఏకజీవనం = మునులకు ప్రాణభూతమైన వానిని; సర్వదేవ + ఆదిపుణ్యాం = సర్వదేవతలకు మొట్టమొదటి పుణ్యమైన వానిని.......॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు సింహచర్మమునే వస్త్రముగా ధరించి యున్నావు. మునీశ్వరులకు ముఖ్యప్రాణము నీవే. సర్వ దేవతలకు ప్రధానమైన పుణ్యము నీవే. అట్టి నీకు బిల్వ పత్రముతో పూజ చేయు చున్నాను.

**శ్లో॥ నిధనేశం ధనాధీశం అపమృత్యు వినాశనం ।**

**లింగమూర్తి మలింగాత్మం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 81**

**అర్థము :-** నిధన + ఈశం = కులమునకు పెద్దయైన వానిని; ధన + అధీశం = ధనమునకు అధిపతియైన వానిని; అపమృత్యు వినాశనం = అకాలమరణమును తొలగించెడి వానిని; లింగమూర్తిం = లింగము యొక్క ఆకారము గలవానిని; అలింగ + ఆత్మం = అనాసక్తమయిన ఆత్మగల వానిని ....॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవే దేవకులమున కంతటికి పెద్దవు. నీవు భిక్షాటకుడుగానే అనిపింతువుగాని నిజమునకు ఐశ్వర్య శాలివి. అకాల మరణమును తొలగించువాడవు నీవే. నీవు లింగరూపములో భక్తులకు

సాక్షాత్కరింతువు. ఇంతయ య్యును నీవు సర్వ సృష్టి యందును అనాసక్తమైన ఆత్మ గలవాడవు. అట్టి నిన్ను దర్శించుచు పూజాపత్రముగా బిల్వపత్రము నొకదానిని నీకు సమర్పించు చున్నాను.

శ్లో॥ భక్త కల్యాణదం వ్యస్తం వేదవేదాంత సంస్తుతం ।
కల్పకృత్ కల్పపాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 82

**అర్థము :-** భక్తకల్యాణదం = భక్తులకు శుభములను దయచేయు వానిని; వ్యస్తం = ఏకాంతుడైన వానిని; వేదవేదాంత సుంస్తుతం = వేదముల చేతను ఉపనిషత్తుల చేతను పొగడబడిన వానిని; కల్పకృత్ = యుగకల్పములను సృజించువానిని; కల్పపాశం = కల్పములనెడి రజ్జువులు గలవానిని.......॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు భక్తులకు శుభములను కలిగింతువు. ఏకాంతముగా నీయంత నీవైయుందువు. వేదముల యందును ఉప నిషత్తులయందును, నీవు సంస్తుతింపబడు చున్నావు. కల్పములను కల్పించు వాడవు నీవు. కల్పము లనెడి బంధనములతో బంధించువాడవు నీవే. అట్టి నీకు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించు చున్నాను.

శ్లో॥ ఘోరపాతక దావాగ్నిం జన్మ కర్మ వివర్జితం ।
కపాలమాలాభరణం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 83

**అర్థము :-** ఘోరపాతక దావాగ్నిం = దారుణములైన పాపములకు కార్చిచ్చు వంటి వానిని; జన్మకర్మ వివర్జితం = జన్మము కాని కర్మము కాని లేని వానిని; కపాలమాలాభరణం = పుర్రెల హారములనే అలంకరించుకొను వానిని.............॥

**తాత్పర్యము** :- ఓ శివా! ఎంతటి దారుణములైన పాపముల నైనను దహించి వేయగల దావాగ్నివంటి వాడవు నీవు. జన్మ కర్మములు మానవులకు సహజములు. కాని నీవు జన్మమును గ్రహించి నవాడవు కావు. కర్మమును గ్రహించినవాడవు కావు. అనగా నీవు వాని కతీతుడవు. పుఱ్ఱెలమాలను కంఠహారముగా ధరించినవాడవు నీవు. అట్టి నిన్ను స్తుతించుచు పూజా పత్రముగా నీకు మారేడు పత్రము సమర్పించు చున్నాను.

**శ్లో॥ మాతంగ చర్మవసనం విరాడ్రూప విదారకం ।**
**విష్ణుక్రాంత మనంతం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 84**

**అర్థము** :- మాతంగ చర్మ వసనం = ఏనుగు చర్మమును వస్త్రముగా ధరించు వానిని; విరాడ్రూప విదారకం = విశ్వాతి శాయియైన రూపమును ఖండించు వానిని; విష్ణుక్రాంతం = విష్ణువు నతిక్రమించిన వానిని; అనంతం = అంతము లేని వానిని ; ............॥

**తాత్పర్యము** :- ఓ శివా! ఏనుగు చర్మమును వస్త్రముగా ధరించి యున్నావు. విశ్వరూపమును కూడ అతిక్రమించిన బృహద్రూపమును ధరించి యున్నావు. విశ్వరూపమును ధరించిన విష్ణుదేవుని సైతము నీ మహారూపము చేత అతిక్రమించినవాడవు. నీవు అనంతుడవు. నీ మొదలుగాని చివరగాని బ్రహ్మ విష్ణువులకే గోచరము కాలేదు. అట్టిది నీ అనంతత్వము. అంతేకాదు. ప్రళయకాలమునందు సర్వమును లయము కాగా నీవు మాత్రమే స్థాణుడవై నిలిచియుందువు. అందువలన కూడ నీవు అనంత నామధేయమునకు అర్హుడవే. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించి అర్చించు చున్నాను.

శ్లో॥ యజ్ఞకర్మఫలాధ్యక్షం యజ్ఞవిఘ్నవినాశకం ।
యజ్ఞేశం యజ్ఞభోక్తారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 85

**అర్థము :-** యజ్ఞ కర్మఫల + అధ్యక్షం = యజ్ఞకార్యము యొక్క ఫలమునకు అధీశుడైనవానిని; యజ్ఞవిఘ్నవినాశకం = యజ్ఞక్రియయందు కలుగు విఘ్నములను నశింప జేయు వానిని; యజ్ఞేశం = యజ్ఞమునకు ప్రభువైన వానిని; యజ్ఞ భోక్తారం = యజ్ఞమునందలి హవ్యములను భుజించు వానిని .......॥

**తాత్పర్యము :-** ఓ శివా! నీవు యజ్ఞపురుషుడవు. యజ్ఞఫలితము ననుభవించువాడవు నీవు. అట్లే యజ్ఞఫలమును యాజ్ఞికునకు అందించు అధ్యక్షుడవు కూడ నీవే. యజ్ఞమునకు దాపు రించు విఘ్నములను నాశనము చేసి యజ్ఞ సఫల పరిసమాప్తికి సహకరించు వాడవు కూడ నీవే. (యజ్ఞ వినాశనము రాక్షసకృత్యము. దక్షయజ్ఞనాశకునిగా శివునికి పేరు గలదు. కాని అదియు దక్షునికి గొఱ్ఱెశిరస్సును అతికించి ప్రాణము పోసి శివానుగ్రహమే యజ్ఞమును పూర్తి చేయించెను.) అట్టి నిన్ను బిల్వ పత్రముతో అర్చించు చున్నాను.

శ్లో॥ కాలాధీశం త్రికాలజ్ఞం దుష్ట నిగ్రహకారకం ।
యోగి మానస సంపూజ్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 86

**అర్థము :-** కాల + అధీశం = కాలమునకు అధీశ్వరుడైన వానిని; త్రికాలజ్ఞం = మూడు కాలములను గురించి తెలిసిన వానిని; దుష్ట నిగ్రహకారకం = దుష్టులను బంధింప జేయువానిని; యోగి మానస సంపూజ్యం = యోగులచేత

మనస్సులలో పూజలందుకొను వానిని; .......॥

**తాత్పర్యము** :-ఓ శివా! నీవు కాలమునకు అధీశుడవు. కాలము నీ అధీనమునందున్నది. నీవు భూత భవిష్యద్వర్తమానములనెడి మూడు కాలములను తెలిసిన వాడవు. దుష్టులను బంధించుటకు కారణమైన వాడవు నీవు. యోగులు తమ మనస్సులలో నిన్నే పూజించు చున్నారు. యోగుల మానస పూజను అందుకొనువాడవు నీవే. అట్టి నిన్ను సాక్షాత్క రించుకొని బిల్వ పత్రముతో పూజించు చున్నాను.

**శ్లో॥ మహోన్నత మహాకాయం మహోదయమహాభుజం ।**

**మహావక్త్రం మహావృద్ధం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 87**

**అర్థము** :- మహోన్నత మహాకాయం = గొప్ప యెత్తుగల గొప్పశరీరము గలవానిని; మహోదయ మహాభుజం = గొప్ప అభివృద్ధి నొందిన గొప్ప బాహువులను గల వానిని; మహావక్త్రం = అనేక ముఖములను గల వానిని; మహావృద్ధం = గొప్పగా శరీరమును పెంచి వృద్ధి నొందిన వానిని ..........॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు అప్రమేయుడవు. కొలతలకు అందని వాడవు. వ్యోమకేశుడ వనుటచేతనే నీ ఔన్నత్యమును కొంత యూహింప వచ్చును. అట్లే అనేక భుజములు గలవాడవు. అనేక ముఖములు గలవాడవు. నీ వృద్ధి యింతయని చెప్పుటకు వీలుకానిది. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వ పత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ సునేత్రం సులలాటం చ సర్వభీమ పరాక్రమం ।**

**మహేశ్వరం శివతరం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 88**

**అర్థము** :- సునేత్రం = మంచి కన్నులు గలవానిని; సులలాటం = మంచి నొసలు గల వానిని; చ = మరియు; సర్వభీమ పరాక్రమం = అందరకును భయము గొల్పు శౌర్యము గలవానిని; మహేశ్వరం = మహేశ్వర నామధేయుని, శివతరం = మంగళకరులలో ఉత్తముని............॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు సుందరములైన నేత్రములు గలవాడవు. సుందరమైన ఫాలభాగము కలవాడవు. అందరకును భయము కల్గించు గొప్ప విక్రమము గలవాడవు. నీ శక్తిశాలిత్వము చేత మహేశ్వరుడన్న ప్రఖ్యాతిని బడసిన వాడవు. ఉత్తమోత్తమ మంగళుడవు. అట్టి నిన్ను సంభావించి బిల్వపత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ సమస్త జగదాధారం సమస్త గుణ సాగరం ।**
**సత్యం సత్యగుణోపేతం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 89**

**అర్థము** :- సమస్త జగత్ + ఆధారం = సర్వలోకములకు ఆధారమైన వానిని; సమస్తగుణ సాగరం = సర్వసుగుణములకు సముద్రము వంటి వానిని; సత్యం = శాశ్వతమైన ఉనికి గల వానిని; సత్యగుణ + ఉపేతం = సత్యగుణ సమ న్వితుడైన వానిని; ........॥

**తాత్పర్యము** :- ఓ శివా! నీవు సర్వలోకములకు ఆధారమైన వాడవు. నీవు సర్వసుగుణములకు సముద్రము వంటి వాడవు. సముద్రమునకు అంతము లేనట్లే నీ సుగుణములకు కూడ అంతము లేదు. నీవు శాశ్వతుడవు. సత్యగుణముతో కలిసియున్న వాడవు. అట్టి నిన్ను సంభావించుచు బిల్వ పత్రార్పనము గావించు చున్నాను.

**శ్లో॥ మాఘ కృష్ణ చతుర్దశ్యాం పూజార్థం చ జగద్గురోః ।**
**దుర్లభం సర్వదేవానాం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 90**

**అర్థము :-** మాఘ = మాఘమాసమునందలి; కృష్ణ చతుర్దశ్యాం = కృష్ణపక్ష చతుర్దశినాడు; జగద్గురోః = జగద్గురువైన శివుని యొక్క; పూజార్థం = పూజకొరకు; సర్వదేవానాం = సర్వదేవతలకును; దుర్లభం = కష్టసాధ్యమైన; ఏకబిల్వం = బిల్వ పత్రమును; శివ + అర్పణం = శివునికి అర్పించు చున్నాను.

**తాత్పర్యము :-** మాఘ కృష్ణ చతుర్దశినాడు సర్వదేవతలకును దుర్లభమైన బిల్వపత్రమును జగద్గురువైన శివుని పూజార్థముగా 'శివార్పణ' మని చెప్పి సమర్పించు చున్నాను.

**శ్లో॥ తత్రాపి దుర్లభం మన్యే నభోమాసేందు వాసరే ।**
**ప్రదోషకాలే పూజాం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 91**

**అర్థము :-** తత్ర + అపి = అందును; నభోమాస = శ్రావణ మాసము నందు; ఇందు వాసరే = సోమవారము నాడు; ప్రదోషకాలే = గోధూళి సమయ మందు; పూజాం = పూజించుటయు; ఏకబిల్వం = బిల్వదళమును; శివార్పణం = శివార్పణమని అర్పించుటయు: దుర్లభం = బహుకష్టమని; మన్యే = భావించు చున్నాను.

**తాత్పర్యము :-** పైని చెప్పినట్లు మాఘమాసములోని పూజకంటె శ్రావణ మాసమునందలి పూజ కష్టతరమని తలచు చున్నాను. శ్రావణ మాసములో సోమవారమునాడు గోధూళి సమయ మందు పూజ చేయుచు "శివార్పణ" మని చెప్పుచు బిల్వ పత్రమును సమర్పింప వలయును.

శ్లో॥ తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం శివాలయం ।
కోటికన్యామహాదానం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 92

**తాత్పర్యము :-** చెరువు త్రవ్వించుట, ధనమును నిక్షేపించుట, బ్రాహ్మణాగ్ర హారమును నిల్పుట, శివాలయమును నిర్మించుట, కోటి కన్యలను మహాదానము చేయుట - వీని కంటె 'శివార్పణ' మని బిల్వపూజచేయుట శ్రేష్ఠము.

శ్లో॥ దర్శనం బిల్వ వృక్షస్య స్పర్శనం పాపనాశనం ।
అఘోరపాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 93

**తాత్పర్యము :-** బిల్వ వృక్షము యొక్క దర్శన స్పర్శనములు పాపములను నశింపజేయును. ఎంతటి దారుణ పాపములైనను 'శివార్పణ' మని బిల్వపూజ చేసిన యెడల నశించిపోవును.

శ్లో॥ తులసీ బిల్వ నిర్గుండీ జంబీరామలకం తథా ।
పంచబిల్వమితి ఖ్యాతం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 94

**తాత్పర్యము :-** తులసి, మారేడు, వావిలి, నిమ్మ, ఉసిరిక యీ యైదింటికి పంచ బిల్వములని పేరు. శివార్పణ మని ఒక బిల్వ పత్రమును సమర్పింప వలయును.

శ్లో॥ అఖండ బిల్వ పత్రైశ్చ పూజయే న్నందికేశ్వరం ।
ముచ్యతే సర్వపాపేభ్య: ఏకబిల్వం శివార్పణమ్ ॥ 95

తాత్పర్యము :- రంధ్రములు లేని బిల్వ పత్రములతో నందికేశ్వరుని కూడ పూజింప వలయును. శివార్పణమని శివునికి బిల్వమును సమర్పింప వలయును. అప్పుడు సర్వపాపములనుండి విడుదల కలుగును.

శ్లో॥ సాలంకృతా శతావృత్తా కన్యాకోటి సహస్రకం ।

సామ్రాజ్యపృథ్వీ దానం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 96

తాత్పర్యము :-అలంకరింపబడిన సహస్రకోటి కన్యలను సామ్రాజ్యము నందలి సర్వభూమిని దానము చేసిన ఫలితము 'శివార్పణ' మని బిల్వ పత్రమును సమర్పించుట చేత లభించును.

శ్లో॥ దంత్యశ్వకోటి దానాని అశ్వమేథ సహస్రకం ।

సవత్సధేను దానాని ఏకబిల్వం శివార్పణమ్ ॥ 97.

తాత్పర్యము :- కోట్లకొలది యేనుగులను గుఱ్ఱములను దానము చేయుట చేతను, వేలకొలది అశ్వమేథములను చేయుట చేతను, దూడలతో పాటుగా పాడియావులను దానము చేయుట చేతను కలిగిన ఫలితము కంటె 'శివార్పణ'మని బిల్వపూజ చేసిన అధిక ఫలితము లభించును.

శ్లో॥ చతుర్వేద సహస్రాణి భారతాది పురాణకం ।

సామ్రాజ్య పృథ్వీదానం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 98

తాత్పర్యము :-శివార్పణ మని ఒక బిల్వమును సమర్పించినచో చతుర్వేద ములను వేలాదిగా దానము చేసిన పుణ్యము లభించును. అట్లే భారత

పురాణాది గ్రంథములను, సామ్రాజ్య భూమిని దానము చేసిన పుణ్యము లభించును.

శ్లో॥ సర్వరత్నమయం మేరుం కాంచనం దివ్యవస్త్రకం ।
తులాభారం శతావర్తం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 99

**తాత్పర్యము :-** శివార్పణమని బిల్వపూజ చేసిన ఫలితము సర్వరత్నముల తోను బంగారముతోను కూడిన మేరుపర్వతమును, దివ్య వస్త్రములను తులాభారము తూగి నూరు రెట్లుగా దానము చేసిన ఫలితము తోను తుల్యము.

శ్లో॥ అష్టోత్తర శతం బిల్వం యోర్చయే ల్లింగ మస్తకే ।
అథర్వోక్తం వదేద్యస్తు ఏకబిల్వం శివార్పణమ్ ॥ 100

**తాత్పర్యము :-** 'ఏకబిల్వం శివార్పణ' మని లింగ శీర్షముపై నూటయెనిమిది బిల్వపత్రములనుంచి అష్టోత్తర శతమును అథర్వణోక్తము ననుసరించి పఠింపవలయును, అర్పింప వలయును.

శ్లో॥ కాశీక్షేత్ర నివాసం చ కాలభైరవ దర్శనం ।
అఘోర పాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 101

**తాత్పర్యము :-** కాశీక్షేత్రమునందు నివసించుట, కాలభైరవుని దర్శించుట యే విధముగా దారుణ పాపములను తొలగించునో ఆ విధముగనే శివార్పణమని బిల్వ పూజ చేయుట ఘోర పాపములను తొలగించును.

శ్లో॥ అష్టోత్తర శతశ్లోకై: స్తోత్రాద్యై: పూజయే ద్యథా ।

త్రి సంధ్యం మోక్షమాప్నోతి ఏకబిల్వం శివార్పణమ్ ॥ 102

**తాత్పర్యము :-** శివార్పణమని బిల్వపత్రమును అర్పింపగా నూటయెనిమిది శ్లోకములతో, స్తోత్రాదులతో మూడు సంధ్యలందును పూజించినట్లుగా భక్తుడు మోక్షమును పొందును.

శ్లో॥ దంతికోటి సహస్రాణాం భూ హిరణ్య సహస్రకం ।

సర్వక్రతుమయం పుణ్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 103

**తాత్పర్యము :-** వేల కోట్ల యేనుగులను భూమిని బంగారమును వేలాదిగా దానము చేయుటవలన, సర్వయజ్ఞ నిర్వహణ వలన లభించెడి ఫలము 'శివార్పణ' మని బిల్వార్చన చేయుట వలన కలుగును.

శ్లో॥ పుత్రపౌత్రాదికం భోగం భుక్త్వాచాత్ర యథేప్సితం ।

అంత్యే చ శివసాయుజ్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 104

**తాత్పర్యము :-**శివార్పణమని బిల్వదళమును సమర్పించిన భక్తుడు ఈ లోకమునందు పుత్రులతో మనుమలతో కోరిన భోగముల ననుభవించి, మరణించిన పిమ్మట శివసాయుజ్యమును పొందును.

శ్లో॥ విప్రకోటి సహస్రాణాం విత్తదానాచ్చ యత్ఫలం ।

తత్ఫలం ప్రాప్నుయాత్ సత్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 105

**తాత్పర్యము :-**కోట్లకొలది జ్ఞానులకు ధనదానము చేయుట చేత ఏ

ఫలము లభించునో నిశ్చయముగా ఆ ఫలమును 'శివార్పణ' మని బిల్వార్చన చేసినవాడును పొందగలడు.

**శ్లో॥ త్వన్నామ కీర్తనం తద్వత్ తవ పాదాంబు యః పిబేత్ ।**

**జీవన్ముక్తో భవే న్నిత్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 106**

**తాత్పర్యము :-** ఒక బిల్వ పత్రమును శివార్పణమని నీకు సమర్పించిన వాడును; నీ నామకీర్తన రసమును అట్లే నీ పాదజలమును త్రాగిన వాడును నిత్యము జీవన్ముక్తుడై యుండును.

**శ్లో॥ అనేక దాన ఫలదం అనంత సుకృతాదికం ।**

**తీర్థయాత్రాఖిలం పుణ్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 107**

**తాత్పర్యము :-** శివార్పణముగా బిల్వార్చనము చేసిన వానికి అనేక దానముల యొక్క ఫలమును, అనంతములైన సత్కార్య ముల యొక్క ఫలమును, అఖిల తీర్థయాత్రల యొక్క పుణ్య ఫలమును లభించును.

**శ్లో॥ త్వం మాం పాలయ సర్వత్ర పదధ్యానకృతం తవ ।**

**భవనం శాంకరం నిత్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 108**

**తాత్పర్యము :-** బిల్వదళమును శివార్పణమని నీకు సమర్పించు చున్నాను. అన్నియెడల నీ పాదములనే ధ్యానించెడి నన్ను పాలిం పుము. ఎల్లప్పుడును నన్ను నీ వానినిగా నుండనిమ్ము.

# అధిక పాఠములు

శ్లో॥ ఉమయా సహితం దేవం సవాహనగణం శివం ।

భస్మానులిప్త సర్వాంగం ఏక బిల్వం శివార్పణమ్ ॥ 109

**తాత్పర్యము** :-- ఓ శివా! పార్వతీదేవితో కలిసి యున్నవానిని; వాహన గణసమేతుడయిన వానిని; విభూతితో పూత పూయబడిన శరీరావయ వములను కలవానిని నిన్ను స్తుతించుచు బిల్వ పత్రమును పూజా పత్రముగా నీకు సమర్పించు చున్నాను.

శ్లో॥ సాలగ్రామ సహస్రాణి విప్రాన్నం శతకోటికం ।

యజ్ఞకోటి సహస్రాణి ఏకబిల్వం శివార్పణమ్ ॥ 110

**తాత్పర్యము** :-వెయ్యి సాలగ్రామములను దానము చేయుట, శత కోటి విప్రులకు అన్నదానము చేయుట, కోట్ల కొలది యజ్ఞము లను చేయుట వీని వలన కలిగెడి ఫలితముతో సమాన మైనది 'శివార్పణ' మని శివునికి బిల్వార్చనము నిర్వ హించుట.

శ్లో॥ అజ్ఞానేన కృతం పాపం జ్ఞానే నాపి కృతం చ యత్ ।

తత్సర్వం నాశమాయాతు ఏకబిల్వం శివార్పణమ్ ॥ 111

**తాత్పర్యము** :-తెలిసికాని, తెలియక కాని చేసిన పాపమంతయును నాశమగు గాక ! శివా! నీకు బిల్వపత్రమును సమర్పించు చున్నాను.

శ్లో॥ ఏకైక బిల్వపత్రేణ కోటియజ్ఞ ఫలం భవేత్ ।

మహాదేవస్య పూజార్థం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 112

**తాత్పర్యము** :-మహాదేవుడైన శివుని పూజ కొరకు బిల్వపత్రమును శివార్పణమని సమర్పించు చున్నాను. ఒక్కొక్క బిల్వ పత్రముచేత కోటియజ్ఞముల ఫలము లభించునుగాక!

శ్లో॥ అమృతోద్భవ వృక్షస్య మహాదేవ ప్రియస్య చ ।

ముచ్యతే కంటకాఘాతాత్ కంటకేభ్యోహి మానవాః॥ ॥ 113

**తాత్పర్యము** :-అమృతోద్భవమైనదియు మహాదేవుడైన శివునికి ప్రీతి పాత్రమైనదనియు నైన బిల్వవృక్షము యొక్క పత్రముతో పూజను నిర్వహించుట చేత కంటకాఘాతముల నుండి, ముండ్లనుండి, ముష్కరుల నుండి నిశ్చయముగా మాన వులు ముక్తిని పొందుదురు.

# ఫలశ్రుతి

శ్లో॥ ఏకకాలే పఠేన్నిత్యం సర్వశత్రు నివారణం ।
ద్వికాలే చ పఠేన్నిత్యం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 114

తాత్పర్యము :-శివార్పణముగా బిల్వదళమును సమర్పించి, యీ స్తవము నొక్క మార్గుగాని రెండు మారులు గాని ప్రతి దినమును చదివిన విరోధులెల్లరును నిరోధింపబడుదురు.

శ్లో॥ త్రికాలే చ పఠేన్నిత్యం మనో వాంఛాఫలప్రదం ।
అచిరాత్ కార్య సిద్ధిం చ లభతే నాత్ర సంశయ: ॥ 115

తాత్పర్యము :-ప్రతి దినము మూడు కాలములందును పఠించిన యెడల మనో వాంఛ ఫలించును. తొందరలోనే కార్యసిద్ధి కలుగును. ఇందు సందియము లేదు.

శ్లో॥ ఏకకాలం ద్వికాలం వా త్రికాలం యః పఠేన్నరః ।

లక్ష్మీప్రాప్తిః శివావాసః శివేన సహ మోదతే ॥ 116

**తాత్పర్యము :-** ఏ నరుడు ఒకమారుగాని రెండు మారులు గాని మూడు మారులుగాని ప్రతిదినము పఠించునో అతనికి సంపదలు లభించును. శివలోకము లభించును. శివుని సహ వాసము తో అతడు ఆనందము నొందును.

శ్లో॥ కోటి జన్మ కృతం పాపం అర్చనేన వినశ్యతి ।

సప్త జన్మ కృతం పాపం శ్రవణేన వినశ్యతి ॥ 117

**తాత్పర్యము :-** కోటి జన్మములలో చేసిన పాపము బిల్వార్చనము చేత నశించును. ఏడు జన్మములలో చేసిన పాపము ఈ స్తోత్రమును శ్రవణము చేయుటచేత నశించును.

శ్లో॥ జన్మాంతర కృతం పాపం పఠనేన వినశ్యతి ।

దివారాత్ర కృతం పాపం దర్శనేన వినశ్యతి ॥ 118

**తాత్పర్యము :-** ఇతర జన్మములయందు చేసిన పాపము స్తోత్ర పఠనము చేత నశించును. అహోరాత్రము లందు (ఒక్కనాడు) చేసిన పాపము దర్శనము చేత నశించును.

శ్లో॥ క్షణేక్షణే కృతం పాపం స్మరణేన వినశ్యతి ।

పుస్తకం ధారయేద్దేహీ ఆరోగ్యం భయ నాశనమ్ ॥ 119

**తాత్పర్యము :-** ప్రతిక్షణమును చేయు పాపము స్మరణమాత్రము చేత నశించును. పుస్తకమును ధారణ చేసినవాడు భయము నశించి ఆరోగ్యవంతుడై జీవించును.

**శ్లో॥ యే మా మనన్య శరణా స్సతతం వరేణ్యం**

**సంపూజయన్తి నవకోమల బిల్వ పత్రైః ।**

**తే నిర్గుణా అపి గుణాంబుధయో భవన్తి**

**విందంతి భక్తి మనుభుక్త సమస్తభోగాః ॥ 120**

**తాత్పర్యము :-** ఎవరు వరేణ్యుడ నైన నన్ను అనన్యశరణులై కొత్తవియు కోమలములునైన బిల్వదళములతో ఎల్లప్పుడును అర్చించు చున్నారో వారు గుణహీనులే యైనప్పటికిని గుణ సముద్రు లగుచున్నారు. వారు సమస్త భోగములను అనుభవించిన వారై భక్తి లాభమును పొందు చున్నారు.

**శ్లో॥ బిల్వాష్టోత్తర శతం స్తోత్రం యః పఠేద్ భక్తిమాన్నరః ।**

**శివలోక మ వాప్నోతి శివేన సహ మోదతే ॥ 121**

**తాత్పర్యము :-** బిల్వాష్టోత్తర శతమనెడి యీ స్తోత్రమును భక్తియుక్తుడై యే మానవుడు పఠించునో, ఆ మానవుడు శివలోకమును పొంది శివునితో ఆనందించును.

**శుభమస్తు**

**లోకాః సమస్తాః సుఖినో భవన్తు**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

# శ్రీ శివ పంచాక్షరీ స్తోత్రమ్

(శ్రీ శంకరాచార్య కృతమ్)

నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై 'న' కారాయ నమశ్శివాయ॥ 1

మందాకినీ సలిలచందన చర్చితాయ
నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ।
మందార ముఖ్య బహుపుష్ప సుపూజితాయ
తస్మై 'మ' కారాయ నమశ్శివాయ॥ 2

శివాయ గౌరీవదనారవింద
సూర్యాయ దక్షాధ్వర నాశనాయ।
శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ
తస్మై 'శి' కారాయ నమశ్శివాయ॥ 3

వశిష్ఠ కుంభోద్భవ గౌతమాది
మునీంద్ర దేవార్చిత శేఖరాయ।
చంద్రార్క వైశ్వానరలోచనాయ
తస్మై 'వ' కారాయ నమశ్శివాయ॥ 4

యక్ష స్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ।
సుదివ్య దేహాయ దిగంబరాయ
తస్మై 'య' కారాయ నమశ్శివాయ॥ 5

పంచాక్షర మిదం పుణ్యం యః పఠేచ్ఛివ సన్నిధౌ।
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే॥



# పంచముఖ శివ ధ్యానమ్

ఓం నం॥ తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి। తన్నోరుద్రః ప్రచోదయాత్॥

శ్లో॥ సంవర్తాగ్ని తటిత్ప్రదీప్త కనక ప్రస్పర్ధి తేజోమయం
గంభీరధ్వనిసామవేదజనకం తామ్రాధరం సుందరమ్।
అర్ధేందుద్యుతి లోలపింగళ జటాభార ప్రబద్ధోరగం
వన్దే సిద్ధసురా సురేంద్రనమితం పూర్వం ముఖం శూలినః॥

ఓం నమోభగవతే రుద్రాయ। ఓం నం। పూర్వ ముఖాయ నమః॥

ఓం మం॥ అఘోరేభ్యోऽథ ఘోరేభ్యో ఘోర ఘోరతరేభ్యః॥ సర్వేభ్యస్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః॥

శ్లో॥ కాలాభ్రభ్రమరాంజనద్యుతినిభం వ్యావృత్త పింగేక్షణం
కర్ణోద్భాసిత భోగిమస్తక మణిప్రోద్గీర్ణదంష్ట్రాంకురం।
సర్పప్రోతకపాలశుక్తిశకల వ్యాకీర్ణసచ్ఛేఖరం
వన్దే దక్షిణ మీశ్వరస్య కుటిల భ్రూభంగరౌద్రం ముఖమ్॥

ఓం నమోభగవతే రుద్రాయ॥ ఓం మం॥ దక్షిణ ముఖాయ నమః॥

ఓం శిం॥ సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః। భవే భవేనాతి భవే భవస్వమాం। భవోద్భవాయనమః॥

శ్లో॥ ప్రాలేయాచలమిందుకుందధవళం గోక్షీర ఫేనప్రభం
భస్మాభ్యక్త మనంగదేహదహన జ్వాలా వళీలోచనమ్।
బ్రహ్మేంద్రాది మరుద్గణై స్తుతిపదై రభ్యర్చితం యోగిభిః
వందే హం సకలం కళంకరహితం స్థాణోర్ముఖం పశ్చిమమ్॥

ఓం నమో భగవతే రుద్రాయ॥ ఓం శిం॥ పశ్చిమ ముఖాయ నమః॥

ఓం వాం॥ వామదేవాయనమో జ్యేష్ఠాయనమ శ్రేష్ఠాయనమో రుద్రాయనమః కాలాయ నమః కలవికరణాయనమో బలవికరణాయనమో బలాయనమో బలప్రమథనాయనమ స్సర్వభూతదమనాయనమో మనోన్మనాయనమః॥

శ్లో॥ గౌరంకుంకుమ పంకిలం సుతిలకం వ్యాపాండుగండస్థలం
భ్రూవిక్షేపకటాక్ష వీక్షణ లసత్సంసక్త కర్ణోత్పలమ్।
స్నిగ్ధం బింబఫలాధరం ప్రహసితం నీలాలకాలంకృతం
వందే పూర్ణశశాఙ్క మణ్డలనిభం వక్త్రం హరస్యోత్తరమ్॥

ఓం నమో భగవతేరుద్రాయ॥ ఓం వాం॥ ఉత్తర ముఖాయ నమః॥

ఓం యం॥ ఈశానస్సర్వవిద్యానామీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి
ర్బ్రహ్మ శివోమే అస్తు సదాశివోమ్॥

శ్లో॥ వ్యక్తావ్యక్త గుణేతరం పరతరం షట్త్రింశతత్త్వాత్మకం
తస్మాదుత్తమతత్త్వమక్షరమిదం ధ్యేయం సదా యోగిభిః॥
ఓంకారాదిసమస్త మన్త్రజనకం సూక్ష్మాతిసూక్ష్మం పరం
శాంతం పంచమమీశ్వరస్యవదనం ఖం వ్యాప్తి తేజోమయమ్॥

ఓం నమో భగవతే రుద్రాయ॥ ఓం యం॥ ఊర్ధ్వ ముఖాయ నమః॥



## పాణి మంత్రము

ఓం నిధనపతయే నమః
ఓం ఊర్ధ్వాయి నమః
ఓం హిరణ్యాయ నమః
ఓం సువర్ణాయ నమః
ఓం దివ్యాయ నమః
ఓం భవాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం శివాయ నమః
ఓం జ్వలాయ నమః
ఓం ఆత్మాయ నమః
ఓం పరమాయ నమః

ఓం నిధనపతాంతికాయ నమః
ఓం ఊర్ధ్వలింగాయ నమః
ఓం హిరణ్యలింగాయ నమః
ఓం సువర్ణలింగాయ నమః
ఓం దివ్యలింగాయ నమః
ఓం భవలింగాయ నమః
ఓం శర్వలింగాయ నమః
ఓం శివలింగాయ నమః
ఓం జ్వలలింగాయ నమః
ఓం ఆత్మలింగాయ నమః
ఓం పరమలింగాయ నమః

ఓం ఏతత్సోమస్య సూర్యస్య సర్వలింగగ్గ్ స్థాపయతి
పాణిమంత్రం పవిత్రమ్॥

# అర్ధనారీశ్వర స్తోత్రమ్

శ్రీ శంకర భగవత్పాద విరచితమ్

చాంపేయ గౌరార్ధ శరీరకాయై కర్పూర గౌరార్ధ శరీరకాయ।
ధమ్మిల్లకాయై చ జటాధరాయ నమఃశివాయై చ నమశ్శివాయ॥ 1

కస్తూరికా కుంకుమ చర్చితాయై చితారజః పుంజ విచర్చితాయ।
కృతస్మరాయై వికృతస్మరాయ నమఃశివాయై చ నమశ్శివాయ॥ 2

ఝుణత్క్వణత్కంకణ నూపురాయై పాదాబ్జ రాజత్ఫణి నూపురాయ।
హేమాంగదాయై భుజగాంగదాయ నమఃశివాయై చ నమశ్శివాయ॥ 3

విశాల నీలోత్పల లోచనాయై వికాసిపంకేరుహ లోచనాయ।
సమేక్షణాయై విషమేక్షణాయ నమఃశివాయై చ నమశ్శివాయ॥ 4

మందార మాలా కలితాలకాయై కపాలమాలాంకిత కంధరాయ।
దివ్యాంబరాయై చ దిగంబరాయ నమఃశివాయై చ నమశ్శివాయ॥ 5

అంభోదర శ్యామల కుంతలాయై తటిత్ప్రభా తామ్ర జటాధరాయ।
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ నమఃశివాయై చ నమశ్శివాయ॥ 6

ప్రపంచ సృష్ట్యున్ముఖ లాస్యకాయై సమస్తసంహారక తాండవాయ।
జగజ్జనన్యై జగదేక పిత్రే నమఃశివాయై చ నమశ్శివాయ॥ 7

ప్రదీప్తరత్నోజ్జ్వల కుండలాయై స్ఫురన్మహా పన్నగ భూషణాయ।
శివాన్వితాయై చ శివాన్వితాయ నమఃశివాయై చ నమశ్శివాయ॥ 8

ఏతత్పఠే దష్టక మిష్టదం యో భక్త్యా స మాన్యో భువి దీర్ఘజీవీ।
ప్రాప్నోతి సౌభాగ్య మనంతకాలం భూయా త్సదా చాస్య సమస్త సిద్ధిః॥ 9

ఇతి శ్రీ మచ్ఛంకచార్యవర్య విరచితం
అర్ధనారీశ్వర స్తోత్రమ్



శివాన్వితాయై చ శివాన్వితాయ
నమః శివాయై చ నమశ్శివాయ